గడిచాయి. ఒక రోజున గంగానదిలో స్నానం చేసి ఒడ్డు
దిగుతుండే కాళ్ళను ఏదో తగిలింది. అది ఏమిటని చూస్తే వీ
ఆ వీణను గురువుగారికి చూపించాడు. గురువుగారు ఆశీర్వదిం
ఆ వీణను తీసుకొమన్నారు కొద్ది రోజులకే యోగి మరణించాడ
దీక్షితార్ తిరిగి తన ఊరుకి ప్రయాణం అయ్యాడు.

కాశీనుండి తిరిగి వస్తూ 'తిరుత్తని' అనే ఊరు చేరా
అక్కడ దీక్షితార్‌కి ఇష్టమైన దేవుడు సుబ్రహ్మణ్యస్వామి ఉన్నాడ
ఆయన దర్శనం చేసుకొని 40 రోజులు స్వామికి శ్రద్ధగా పూ
చేశాడు.41వ రోజు ఒక బ్రాహ్మణుడు వచ్చి 'ముత్తుస్వా
నోరు తెరు' అన్నాడు. దీక్షితార్ నోరు తెరిచేసరికి ఆయ
నోటిలో పటిక బెల్లం వేసి మాయమై పోయాడు. ఆ వచ్చిం
సుబ్రహ్మణేశ్వరస్వామే! అంతే దీక్షితార్‌కు అప్రయత్నంగా కవిత
వచ్చింది. 'మాయామాళవగౌళ' రాగంలో శ్రీనాదాధి గురుగుహ
జయతిజయతి' అన్నకీర్తన రాశాడు. గుహుడు అండే సుబ్రహ్మ
స్వామి. ఆ గుహుడుడే తన గురువు అని భావించి ఆయ
మీద ఇంకాకీర్తనలు రాశాడు 'మానస గురు గుహరూపం భజ
(ఆనంద భైరవిరాగం) 'శ్రీ గురుగుహ దాసోహం', 'శ్రీగురుణా
గురుగుహాయ' ఇలా చాలాకీర్తనలు తిరుత్తనిలోరచించాడ
ఈకీర్తనలు ఆయన రాసేసరికి ఆయన వయసు 25 సంవత్సరా
మాత్రమే.

తిరుత్తని నుంచి తిరుపతి వెళ్ళాడు. వెంకటేశ్వర స్వామి
'శేషాచలనాయకం' అనే వరాళి రాగ కీర్తన రాశాడు. శ్రీకాళహ
వెళ్ళి 'శ్రీకాళహస్తీశ' అనే హుసేని రాగ కీర్తన అక్కడ రచించా

తాక్షి' (కమలామనోహరి) 'నీరజాక్షి కామాక్షి' (హిందోళరాగం) అప్పుడు రచించినవే. అలాగే ఏకామ్రేశ్వరునిపై భైరవి రాగంలో 'చింతయమాకంద' అనే కృతి, పూర్వీకల్యాణి రాగంలో 'ఏకామ్రనాథం భజేహం' అనే కృతి రచించాడు. కంచిలో వున్న కైలాస నాథస్వామి పైన 'కైలాస నాథం' (వేగ వాహిని రాగం), కాంభోజి రాగంలో 'కైలాస నాథేనా' అనే కీర్తన రచించాడు.

కంచిలో ఉపనిషద్బ్రహ్మేంద్ర సరస్వతి ఉండేవారని మనం ముందు చెప్పుకున్నాం. ఆయన 'రామాష్టపది' అని జయదేవుడి గీత గోవిందంలాంటిది రచించాడు. ఆ రామాష్టపదికి దీక్షితార్ స్వరాల్ని కూర్చాడు. కంచిలో నాలుగు సంవత్సరాలు ఉన్నాడు. అక్కడనుంచి తిరువన్నామలై చేరాడు. అక్కడ ఉన్న ఈశ్వరుడి పేరు అరుణాచలేశ్వరుడు. ఆయన పైన 'అరుణాచల నాథం స్మరామి' అనే కీర్తన రాసి, గానం చేశాడు. అక్కడనుంచి చిదంబరం వెళ్ళాడు. అక్కడ శివుడిపేరు నటరాజస్వామి. ఆయన పైన చాలా కృతులు రాశాడు దీక్షితార్. కేదారరాగంలో 'ఆనందనటప్రకాశం' అన్న కీర్తన బాగా ప్రచారంలో ఉంది. అక్కడ నుంచి వైదీశ్వరకోవెల్ వెళ్ళాడు. అక్కడ ఉన్న దేవతలపైన కీర్తనలురచించాడు. అక్కడ నుంచి మయూరం అనే ఊరువెళ్ళి అక్కడ ఉన్న మయూరనాథస్వామి పైన ఎన్నో కీర్తనలు రాశాడు. తిరిగి తిరువారూరు చేరాడు.

తిరువారూరులో త్యాగరాజేశ్వరుడి గుడి ఉంది. ఆ

త్యాగరాజస్వామి పైన ఉన్న ...

ఉన్న 'కమలాంబికే' అనే అమ్మవారిపైన నవావరణ కీర్తనల అనే 11 కీర్తనలు రాశాడు. తిరువారూరులోనే ఉన్న త్యాగరాజస్వామి ఆలయంలో 16 రకాల గణపతి విగ్రహాల ఉన్నాయి. ఆ పదహారు రకాల గణపతి విగ్రహాలపై 16 కీర్తనల రాశాడు. తిరువారూరు దగ్గర ఉన్న కీవళూరులో 'అక్షయలింగ స్వామి' అనే ఈశ్వరుడి గుడి ఉంది. ఆయనపైన శంకరాభరణ రాగంలో 'అక్షయలింగవిభో' అనే కీర్తన రాశాడు.

తొమ్మిది గ్రహాలపైన కీర్తనలు రాశాడు. వాటిని నవగ్రహకీర్తనలు అంటారు.

దీక్షితార్ ముద్ర 'గురుగుహ'. దీక్షితార్ ప్రతికీర్తనలోనూ ఆ కీర్తన ఏ రాగంలో ఉందో ఆ రాగం పేరుకూడా వస్తుంది. ఉదాహరణకి హంసధ్వని రాగంలో 'వాతాపిగణపతింభజే' కీర్తన చివరిలో 'హంసధ్వని భూషిత హేరంభం' అని హంసధ్వని రాగం పేరు కూడా వస్తుంది. దీక్షితార్ కీర్తనలన్నీ ఎక్కువగా సంస్కృతంలో ఉన్నాయి. కొన్ని తెలుగులోను, కొన్ని తమిళంలోను ఉన్నాయి.

ఇంకా మధుర మీనాక్షిపైన రామేశ్వరంలో సుందరాజస్వామి పైన, శబరిమలైలో ఉన్న అయ్యప్పపైన, గురువాయూరులో ఉన్న కృష్ణుడిపైన కీర్తనలు రాశాడు. 1 లో ఎట్టయాపురంలో మరణించాడు దీక్షితార్.



# 9 శ్యామశాస్త్రి



శ్యామశాస్త్రి పూర్వీకుల ప్రకాశం జిల్లా కంభంలో ఉండేవారు. తమిళనాడుకి వలసపోయారు. శ్యామశాస్త్రి 26 ఏప్రియల్ 1762లో తిరువారూరులో పుట్టాడు. తండ్రి విశ్వనాథయ్యార్. 'బంగారు కామాక్షిదేవి' అనే దేవత విగ్రహం తిరువారూరులో త్యాగరాజేశ్వరుని గుడిలో ఉండేది. ఆ విగ్రహానికి శ్యామశాస్త్రి తండ్రి అర్చకుడు.

వి|గ్రహంతోపాటు వి|గ్రహానికి పూజారి అయిన విశ్వనాథయ్యర్
కుటుంబం కూడా తంజావూరు చేరింది.

శ్యామశాస్త్రి అసలు పేరు 'వేంకట సుబ్రహ్మణ్యం' అయిన
తల్లితండ్రులు ముద్దుగా శ్యామకృష్ణాఅని పిలచేవారు. 'శ్యామశాస్త్రి'
అన్న పేరుతోనే ప్రఖ్యాతి గాంచాడు. 'శ్యామకృష్ణ' అన్న పేరున
తనకీర్తనల్లో ముద్రగా వాడాడు.

చిన్నతనంలోనే శ్యామశాస్త్రి సంస్కృతం, తెలుగు, తమిళ
భాషల్లో పాండిత్యం సంపాదించుకొన్నాడు. తనమేనమామ దగ్గర
సంగీతం నేర్చుకొన్నాడు. చక్కగా పాడేవాడు.

ఒకరోజు సంగీత స్వామి అనే సన్యాసి శ్యామశాస్త్రి ఇంటి
వచ్చాడు. ఈ సన్యాసికి సంగీతం బాగావచ్చు. శ్యామశాస్త్రి
తన శిష్యుడిగాస్వీకరించి, సంగీత రహస్యాలు నేర్పాడు
ఆకాలంలోనే పచ్చి మిరియం ఆదెప్పయ్య అనే సంగీత విద్వాంసుడు
ఉండేవాడు. శ్యామశాస్త్రిని, సంగీతస్వామి ఈ అదెప్పయ్యగానం
రోజూ వినమని కోరాడు. భైరవి రాగంలో 'విరబోణి' అన్నవర్ణాన్ని
అదెప్పయ్య రచించాడు. ఇది బాగా ప్రచారంలో ఉంది. శ్యామశాస్త్రి
అదెప్పయ్య గానం వింటూండేవాడు. తండ్రి మరణించాక బంగారు
కామక్షీ దేవికి పూజారి అయ్యాడు. భక్తితో ఆదేవిని పూజించుకొంటు
ఉండేవాడు. కామాక్షీదేవి ఆయనతో మాట్లాడేది. కామాక్షీదేవిని
భక్తితో పూజిస్తున్న సమయంలో ఎన్నో కృతులు రచించేవాడు
శ్యామశాస్త్రి, కృతులేకాకుండా కొన్ని వర్ణాలు, స్వరజతులుకూడా
రచించాడు.

చాలా కీర్తనలు రాశాడు. తాళాల్లో మిశ్రచాపు అంటే చాలా ఇష్టం.

శ్యామశాస్త్రిని 'సంగీత సమ్రాట్టు' అని పిలిచేవారు శ్యామశాస్త్రికి శిష్యులు తక్కువమంది ఉండేవారు. సుమారు 300 కీర్తనల్ని శ్యామశాస్త్రి రచించాడని చెబుతారు. కానీ మనకు దొరికినవి చాలా తక్కువే.

శ్యామశాస్త్రి మధురలో ఉన్న 'మీనాక్షి దేవిపైన తొమ్మిది కృతులు రచించాడు. అందులో ఏడు బాగా ప్రచారంలో ఉన్నాయి. అవి

1. సరోజదళనేత్రి - శంకరాభరణరాగం - ఆదితాళం
2. దేవి మీననేత్రి - శంకరాభరణరాగం - ఆదితాళం
3. మరివేరెగతి - ఆనందభైరవిరాగం - చాపుతాళం
4. నన్ను బ్రోవులలితా - లలిత - చాపుతాళం
5. మాయమ్మ - ఆహిరి - ఆదితాళం
6. దేవి నీదు పదసారస - కాంభోజి
7. మీన లోచన బ్రోవ - ధన్యాసి

శ్యామశాస్త్రి మామూలుగా ప్రసిద్ధరాగాలైన కల్యాణి, శంకరాభరణం, తోడి, మధ్యమావతి లాంటి రాగాలే కాకుండా, చింతామణి, మాంజి, కలగడ లాంటి అపురూప రాగాలలో కూడా కీర్తనలు రచించాడు. ఎక్కువ కృతులు తెలుగులోను, కొన్ని సంస్కృతంలోను, మరికొన్ని తమిళంలోను ఉన్నాయి. తాళం గురించిరాసిన గ్రంథం ఒకటి కూడా మనకు దొరికింది. లయ

నులువుగా నేర్చుకోలేము.

తంజావురు రాజ్యాన్ని 'శరభోజీ' పాలిస్తూండేవా
బొబ్బిలి కేశవయ్య అనే సంగీతవిద్వాంసుడు తంజావూరువ
అప్పుడు విద్వాంసులను సంగీతంలో తనతో పోటీ చేయమన్నా
అక్కడ విద్వాంసులంతా అతనితో పోటీచేయడానికి భయపడ్డా
శ్యామశాస్త్రి దగ్గరకు వెళ్ళి, కేశవయ్యతో పోటీచేయమని కోరా
శ్యామశాస్త్రి అందుకు ఒప్పుకొన్నాడు. కామాక్షీదేవి దగ్గరకు
'చింతామణి' రాగంలో దేవిబ్రోవసమయమిదే' అనే కీర్తన రచి
పాడాడు. ఆ తరువాత కేశవయ్యతో పోటీకి దిగాడు. కేశవ
'సింహనందన' అనే ఒక తాళంలో పల్లవి పాడి, శ్యామశా
తిరిగి పాడమన్నాడు. శ్యామశాస్త్రి ఆ పల్లవిని అవలీలగా పాడా
శ్యామశాస్త్రి 'శరభనందన' అనే చాలాకష్టమైన తాళంలో ప
పాడి, తిరిగి కేశవయ్యను పాడమన్నాడు. కేశవయ్య ఆ పల్ల
పాడలేక ఓడిపోయాడు. శ్యామశాస్త్రికి రాజు ఎన్నెన్నో బహుమతు
ఇచ్చి గౌరవించాడు.

అప్పుకుట్టి అనే సంగీత విద్వాంసుడు కూడా శ్యామశాస్త్రి
పోటీచేసి ఓడిపోయాడు. శ్యామశాస్త్రికి జ్యోతిష్యంలోకూడా మ
పాండిత్యం ఉండేది. ముఖం చూసి భవిష్యత్తు చెప్పేవాడు.

శ్యామశాస్త్రికి చాలా అనుకూలవతియైన భార్య ఉండే
ఆమె మరణించిన రోజునే శ్యామశాస్త్రి కూడా సిద్ధిపొందాడ
ఆయన మరణించినది ఫిబ్రవరి 6, 1 సంవత్సరం.

శ్యామశాస్త్రికి పంజుశాస్త్రి, సుబ్బరాయశాస్త్రి అని ఇద్ద

నేర్చుకొని, వాగ్గేయకారుడయ్యాడు. శ్యామశాస్త్రి శిష్యులలో పొరుంబూర్ కృష్ణయ్యర్ మంచి గాయకుడు. అలనూరు కృష్ణయ్యర్ మైసూరు ఆస్థాన విద్వాంసుడిగా ఉండేవాడు. దాసరి అనే నాగస్వర విద్వాంసుడు కూడా శ్యామ శాస్త్రి శిష్యుడే.

## కర్ణాటక సంగీత త్రిమూర్తులు

మనం ఇతవరకు చెప్పుకొన్న త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రి ఈ ముగ్గురు వాగ్గేయకారుల వల్ల మన కర్ణాటక సంగీతం ఎంతో అభివృద్ధి చెందింది. ఈ ముగ్గురూ కూడా సమకాలికులు కావడం, ముగ్గురూ తిరువారూరులోనే పుట్టడం కూడా విశేషం. ఈ ముగ్గురు వాగ్గేయకారుల్ని కలిపి, కర్ణాటక సంగీత త్రిమూర్తులు లేదా కర్ణాటక సంగీతరత్నత్రయం అని పిలుస్తారు.

శ్యామశాస్త్రికి త్యాగయ్యకు బాగాస్నేహం ఉండేది. వీళ్లిద్దరూ అప్పడప్పుడు కలుసుకొంటూ ఉండేవారు. సంగీతం గురించి చర్చించుకొంటూ ఉండేవారు. దీక్షితార్ ఎప్పుడూ తీర్థయాత్రలు చేస్తూండడం వల్ల ఆయన మిగిలిన ఇద్దరిని ఎక్కువగా కలుసుకోనేవారు కారని అంటారు.

ఈ ముగ్గురు వాగ్గేయకారులు చిరస్మరణీయులు.

# 10. స్వాతి తిరునాళ్



శ్రీకృష్ణదేవరాయలు రాజైనా కూడా గ్రంథాలు ఎలా రాశాడ
అలాగే రాజైనా కూడా ఎన్నో సంగీత రచనల్ని చేశాడు 'స్వా
తిరునాళ్'. చాలా భాషల్లో కూడా రచనలు చేశాడు. 18
ఏప్రియల్ 16న జన్మించాడు. స్వాతి తిరునాళ్‌కి తల్లితండ్రు
పెట్టిన పేరు రామశర్మ కాని 'స్వాతి' నక్షత్రంలో పుట్టడం

రాజరాజ వర్మ స్వాతి తిరునాళ్ తల్లితండ్రులు. చిన్నతనంలో తల్లి, తండ్రి మరణించారు. పినతల్లి పార్వతీబాయి పెంచింది. స్వాతి తిరునాళ్ చిన్నతనంలోనే సంస్కృతం, మళయాళం, కన్నడ, తెలుగు, మరాఠీ భాషలు, కర్ణాటక హిందుస్థానీ సంగీతాలు కూడా నేర్చుకొన్నాడు. 16వ ఏటనుంచి కేరళ రాజ్యాన్ని ఏలడం ప్రారంభించాడు. ఎందరో సంగీత విద్వాంసుల్ని, భాషాపండితుల్ని కవుల్ని తన ఆస్థాన విద్వాంసులుగా నియమించాడు. అల్లావుద్దీన్ అనే హిందుస్థానీ సంగీత విద్వాంసుడు, వడివేలు, పొన్నయ్యాపిళ్ళై, చిన్నయ్యా పిళ్ళై, వేంకటాద్రి భాగవతార్, పరమేశ్వర భాగవతార్ లాంటి కర్ణాటక సంగీత విద్వాంసులు ఈయన ఆస్థానంలో ఉండేవారు.

స్వాతి తిరునాళ్ చాలామంది దేవుళ్లపైన, దేవతలపైన కృతులు రచించాడు. స్వరజతులు, వర్ణాలు, పద వర్ణాలు, పదాలు, జావళీలు, తిల్లానాలు, కూడా రచించాడు. అలాగే హిందుస్థానీ సంగీతానికి సంబంధించిన సంగీత రచనల్ని కూడా చేశాడు. హిందుస్థానీ సంగీతరచనలు చేసిన మొదటి దక్షిణ భారత వాగ్గేయకారుడు స్వాతి తిరునాళ్. సంగీత రచనలే కాకుండా కుచేలోపాఖ్యానం, అజామీళోపాఖ్యానం, అనే హరికథలు కూడా రచించాడు.

స్వాతి తిరునాళ్ తన సంగీతరచనల్లో చాలా ముద్రలు వాడాడు. 'అబ్జనాభ', 'అంభోరుహనాభ', 'సరసిజనాభ',

వాడాడు. 'పద్మనాభ' అన్న ముద్ర ఎక్కువగా వాడాడు.

చారుకేసి రాగంలో 'కృపయాపాలశౌరే' కానడ రాగ 'మామవసదాజననీ' కుంతలవరాళిలో 'భోగీంద్ర శాయినం' కృతులు కచేరీలలో తరుచు వినపడతాయి. ఇవి స్వాతి తిరు రచించినవే. అలాగే 'గీతదునికుతకతోం' అనే తిల్లానా 'ధ రాగంలోది కూడా ఈయన రచనే. ఇది కూడా ఐ ప్రచారంలోఉంది. అలాగే తరుచు నృత్యప్రదర్శనలో విని కీర్తన ఒకటి ఉంది. అది 'భావయామి రఘు రామం' అన్న ఇది రాగమాలిక. అంటే చాలా రాగాలలో ఉంది. పల్లవి ఒకరా చరణాలు ఒకొక్కటి ఒకొక్కరాగంలో ఉంటాయి. దీనినే రాగమా అంటాం. ఈ 'భావయామి రఘురామం' కీర్తనలో మరో విశే కూడా ఉంది. రామాయణ కథ అంతా ఈ కీర్తనలో వస్తుం నృత్యప్రదర్శనలలో ఈ కీర్తన అర్థానికి తగినట్లు నృత్యం చేస్తా

స్వాతితిరునాళ్‌కు త్యాగయ్య గానం వినాలని ఉండే త్యాగయ్యను తీసుకొని రమ్మని తన అస్థానంలో ఉన్న వడి అనే సంగీత విద్వాంసుణ్ని పంపాడు కాని, త్యాగయ్య రావడా ఇష్టపడలేదు. స్వాతి తిరునాళ్ 1846 డిసెంబరు 25న మరణించాడ మరణించేటప్పటికి ఆయనవయస్సు కేవలం 33 సంవత్సరా స్వామితిరునాళ్ అంత చిన్నవయస్సులో మరణించడం వ సంగీతరంగానికి తీరనిలోటు.

# 11. వీణ కుప్పయ్యర్

త్యాగయ్య శిష్యుడు వీణ కుప్పయ్యర్ త్యాగయ్య లాగే వాగ్గేయకారుడు. 1798 - 1860 మధ్య జీవించాడు. మద్రాను దగ్గర ఉన్న తిరువొత్తియూరులో కుప్పయ్యర్ పుట్టాడు. ఈయన తండ్రి 'సాంబమూర్తి' ఆయన చాలా గొప్పవీణ విద్వాంసుడు

కుప్పయ్యర్ తమిళ బ్రాహ్మణుడు. చిన్నతనంలోనే తెలుగు, సంస్కృతం బాగా నేర్చుకొన్నాడు. త్యాగయ్య దగ్గర శిష్యుడిగా చేరడానికి ముందే సంగీతం తండ్రి దగ్గర బాగానేర్చుకొన్నాడు. వీణ నేర్చుకొన్నాడు. ఫిడేలు (వైలెన్) బాగా వాయించేవాడు. అలాగే బాగా పాడేవారు. ఈయనకు 'గానచక్రవర్తి' అనేబిరుదు ఉండేది. కుప్పయ్యకు ' నారాయణగౌళ' రాగం అంటే చాలా ఇష్టం. ఈ రాగం ఆరోహణ, అవరోహణలోనూ వక్రం. దీనిని పాడడం చాలా కష్టం. ఈ రాగాన్ని చాలా గొప్పగా పాడేవాడు కుప్పయ్యర్. అలాగే - రీతిగౌళ రాగం కూడా అద్భుతంగా పాడేవాడు. నారాయణ గౌళ, రీతిగౌళ రాగాలలో వర్ణాల్ని కూడా రచించాడు.

కుప్పయ్యర్, వేణుగోపాలస్వామి భక్తుడు. అందుకనే తన కీర్తనల్లో 'గోపాలదాస' అనే ముద్రను వాడేడు. త్యాగయ్య, కుప్పయ్య ఇంటికి వచ్చి కొన్నిరోజులు ఉండి కొన్ని కీర్తనలు కూడా రచించాడు.

1 లో కుప్పయ్యర్ మైసూరువెళ్ళాడు. అక్కడ

కృతి రాశాడు.

కుప్పయ్యార్ తిరువొత్తియూర్ వదలి మద్రాసు
ఉండేవాడు. కుప్పయ్యార్ కొడుకే తిరుపత్తియూర్ త్యాగయ
ఈయన కృషివల్ల మద్రాసులో సంగీత సభలు చాలా స్థా
బడ్డాయి.

కుప్పయ్యార్ వర్ణాలు, కృతులు, తిల్లానాలు కు
రచించాడు. వీరి రచనలు తెలుగులోనే ఉన్నాయి. కొ
సంస్కృతంలో కూడా ఉన్నాయి అంటారు. వర్ణాల్ని రచించడం
కుప్పయ్యార్ చాలా నిపుణుడు. ఈయన రచించిన వర్ణాలు
త్యాగయ్య ఎంతగానో మెచ్చుకొన్నాడు. ఈయన కృత
త్యాగయ్య కృతుల్ని పోలి ఉంటాయి.

కుప్పయ్య వెంకటేశ్వరస్వామి పైన ఐదు కీర్త
శ్రీకాళహస్తిలో ఉన్న ఈశ్వరుడిపైన ఐదు, తిరువత్తియూర్
త్రిపురసుందరీ అమ్మవారిపైన ఎనిమిది కృతులు రచించా
పాశ్చాత్య సంగీతంతో కూడా కుప్పయ్యార్‌కు పరిచయం వు
ఈయన రచించిన బిలహరి రాగవర్ణంలో కొంచెం పాశ్చాత్య సం
పోకడలు కనిపిస్తాయి.

1900 సంవత్సరంలో కుప్పయ్యార్ కొడుకు తిరువొత్తియు
త్యాగయ్యర్, తన తండ్రి రచనలన్నింటినీ ముద్రించా
కుప్పయ్యార్‌కు చాలామంది శిష్యులు ఉండేవారు. ప
సీతారామయ్య, కొత్తవాసన్ వెంకట్రామయ్య, ఫిడేలు పొన్నుస్వా
మొదలైన వాళ్ళు ఈయన శిష్యులే.

# 12. పట్నం సుబ్రహ్మణ్యయ్యర్

త్యాగరాజ స్వామికి ప్రశిష్యుడు పట్నం సుబ్రహ్మణ్యయ్యర్. ప్రశిష్యుడు అంటే త్యాగరాజు శిష్యుడికి శిష్యుడు. 1 లో తంజావూరులో పుట్టాడు. తిరువైయార్‌లో ఉండేవాడు. తనమేన మామ మేలట్టూర్ గణపతి శాస్త్రి దగ్గర సంగీతం నేర్చుకొన్నాడు ఆ తరువాత, త్యాగరాజస్వామి శిష్యుడైన మానాంబు చావడి వెంకటు సుబ్బయ్యర్ దగ్గర సంగీతం నేర్చుకొన్నాడు.

సుమారు వంద సంగీత రచనలు చేశాడు సుబ్రహ్మణ్యయ్యర్ కృతులు, జావళీలు, తిల్లానాలు రాశాడు. తెలుగు, సంస్కృతం తమిళం లోకూడా రచనలు చేసాడు. ఈయన బేగడ రాగాన్ని బాగా పాడేవాడు. అందుకే బేగడ సుబ్రహ్మణ్యయ్యర్ అని కూడా ఈయన్ని పిలుస్తూండేవారు. ఈయన ముద్ర 'వెంకటేశ'. ఈయన కృతులు త్యాగయ్య కృతుల్ని పోలి ఉంటాయి. నారాయణి సింహవాహిని, కన్నడ, మందారి లాంటి అపురూపరాగాలలో కూడా కీర్తనల్ని రచించాడు. రాగం, తానం, పల్లవి చాల గొప్పగా పాడేవాడు. ఈయన తన కచేరీల్లో సగం సమయం దీనికే కేటాయించేవాడు. పూర్ణచంద్రిక, ఖరహరప్రియ, కన్నడగౌళ శుద్ధసావేరి, బేగడ ఈయనకు ఇష్టమైన రాగాలు. ఈయన కచేరీ చేసేటప్పుడు ఎక్కువగా త్యాగరాజకృతులే పాడేవాడు. ఎవరైనా ఆయన రచనల్ని పాడమంటే అప్పుడు ఒకటి, రెండు తన రచనల్ని కచేరీ చివరలో పాడేవాడు. తను రాసిన కీర్తనల

ముందు విద్వాంసులకి పాడి వినిపించేవాడు. వాళ్ళు ఆ రచ
బాగున్నాయని మెచ్చుకొంటేనే తన శిష్యులకి నేర్పేవా
ఈయనకు చాలామంది శిష్యులు ఉండేవారు. వాళ్ళలో రామ
శ్రీనివాసయ్యంగార్, మైసూర్ వాసుదేవాచార్య, టైగర్ వరదా
చాలా ప్రఖ్యాతి గాంచిన వాగ్గేయకారులు.

పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ 'కదనకుతూహలం' ఀ
రాగాన్ని సృష్టించారు. అందులో 'రఘువంశ సుధాంబుధి చంద్ర
అన్న కీర్తనని రాశారు. ఈ కీర్తన బాగా ప్రచారంలో ఉ
**31-7-1902** లో సుబ్రహ్మణ్యయ్యర్ మరణించాడు.

# 13. సదాశివ బ్రహ్మేంద్ర

**17**వ శతాబ్దంలో ఉన్న వాగ్గేయకారుడు సద
బ్రహ్మేంద్ర. ఈయన సన్యాసి. దిగంబరంగానే ఉండేవాడు.
ఉండేదికాదు. కావేరీ నదీ తీరాలలో తిరుగుతూ, ఏది దొ
అది తింటూండేవాడు. ఈయన తండ్రి మహాదేవ దీక్షితార్. సద
బ్రహ్మేంద్ర కంచిలో ఉండే పరమశివేంద్రసరస్వతి శిష్యుడు. ఈ
ముద్ర 'పరమహంస'. చాలా కీర్తనల్ని సంస్కృతంలో రాశా
'మానస సంచరరే బ్రహ్మణి' అన్న కీర్తన ఈయన రాసి
ఇది సామరాగంలో ఉంది. ఈయన శివమానస పూజ, ఀ
విద్యావిలాసమ్, బ్రహ్మసూత్ర ప్రవృత్తి అనే గ్రంథాలు రాశా
సంగీత కచేరీ చివరలో ఈయన కీర్తనలు పాడుతూంట
అప్పుడప్పుడు రేడియోలో ఉదయం వచ్చే భక్తిరంజని కార్యక్రమ

‘భజరేగోపాలం’, ‘స్మరవారం వారం’ ‘గాయతి వనమాలి’, ‘భజరేయదునాథం’, ‘పిబరే రామరసం’, ‘ప్రతివారం వారం’, ‘ఖేలతిమామా హృదయే’ ఈ కీర్తనలు బాగా ప్రచారంలో ఉన్నాయి. 1714లో కరూరుల్లో సిద్ధిపొందాడు సదాశివబ్రహ్మేంద్ర.

## 14. పల్లవి శేషయ్యర్

1 -1909 ప్రాంతంలోవాడు పల్లవిశేషయ్యర్. త్యాగయ్య శిష్యపరంపరకు చెందినవాడు. తెలుగుబ్రాహ్మణుడు. పల్లవి పాడడంలో గొప్ప ప్రతిభకలవాడు. అందుకే ఈయనను (రాగం, తానం, పల్లవి) పల్లవి శేషయ్య అని పిలిచేవారు. ఈయన తండ్రి సుబ్బయ్యర్. ఈయన తనకీర్తనల్లో ‘శేష’ అనే ముద్రను వాడాడు. తిల్లానాలు, పదవర్ణాలు, కీర్తనలు రచించాడు. రాగభావంతో నిండి ఉంటాయి ఈయన రచనలు.

చిన్నతనంలోనే తండ్రినుంచి త్యాగరాజస్వామి కీర్తనలు నేర్చుకొన్నాడు. ‘గౌళిపంతు’ అనే రాగం ఉంది. ఇది చాలా కష్టమైన రాగం. దీనిని ఒకసారి మూడు గంటలసేపు పాడాడు. ‘మల్లికావసంతం’ ‘శుద్ధ’ అనే రాగాలలో కీర్తనలు రచించినది ఈయనే. ‘భైరవి’, ‘పూర్ణషడ్జం’, ‘గౌరీమనోహరి’, ‘కేదారగౌళ’, ‘సామ’, ‘ఖమాస్’, ‘కేదారం’, ‘గరుడధ్వని’, ‘శుద్ధసావేరి’, ‘హిందుస్థానీ’ ‘బేహాగ్’, ‘శుభపంతువరాళి’, ‘కనకాంగి’, ‘మానవతి’, ‘తానరూపి’, ‘సేనాపతి’, ‘ధేనుక’, ‘నాటకప్రియ’,

'కోకిలప్రియ', 'పుష్పలతికో', 'ద్విజావంతి', 'నారాయణ గౌ
రాగాలలో ఈయన రచనలు చేశాడు. ఈయన గొప్పరామభక్తుడ
కచేరీలలో రాగం, తానం, పల్లవికి ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చేవా
1 లో సేలంలో మరణించాడు.

## 15. మైసూర్ సదాశివరావు

ఈయన మహారాష్ట్ర బ్రాహ్మణుడు. త్యాగయ్య శిష్యు
వాలాజీపేట వెంకటరమణ భాగవతార్ శిష్యుడు. 18-
శతాబ్దాలలో ఉన్నవాడు. ఈయన ముద్ర 'సదాశివ'. కృతు
వర్ణాలు, తిల్లానాలు రచించాడు. సంస్కృత, ఆంధ్రభాష
పండితుడు. ఈయన జన్మస్థలం చిత్తూరు. తన 30వ ఏట చిత్తు
వదలి మైసూర్ వెళ్ళాడు. మరణించేవరకు అక్కడే ఉన్నా
అఠాణా రాగంలో 'వాచామగోచరుండని' అనే ఈయన కీ
బాగా ప్రచారంలో ఉంది.

## 16. సుబ్బరాయ శాస్త్రి

శ్యామశాస్త్రి కుమారుడు సుబ్బరాయశాస్త్రి. సం
త్రిమూర్తులు ముగ్గురి దగ్గరా సంగీతం నేర్చుకొన్నాడీయ
1803లో తంజావూరులో పుట్టాడు. గాత్రం పాడేవాడు.
కూడా బాగా వాయించేవాడు. స్వరజతులు, కృతులు రచించా
ఈయన ముద్ర 'కుమార'. దేవీ భక్తుడు ఈయన కృతుల

కృతుల్ని, కొన్ని ముత్తుస్వామి దీక్షితార్ కృతుల్ని, మరికొన్ని శ్యామశాస్త్రి కృతుల్ని పోలి ఉంటాయి. ఈయన కీర్తనల్లో 'జననీనిన్నువినా' (రీతిగౌళరాగం) 'నినువినాగతిగానజగాన' (కల్యాణిరాగం) ఇవి బాగా ప్రచారంలో ఉన్నాయి 1 లో మరణించాడు.

## 17. గోపాలకృష్ణ భారతి

1810 సంవత్సరంలో పుట్టిన గోపాలకృష్ణ భారతి వెయ్యికి పైగా కీర్తనలు రాశాడు. ఇవి తమిళ భాషలో ఉన్నాయి. 'నందనార్ చరిత్ర' అనే తమిళ సంగీత నాటకాన్ని రచించాడు. ఈయన ముద్ర 'గోపాలకృష్ణ' తంజావూరు జిల్లా ముడికొండన్‌లో పుట్టాడు. **1896**లో మరణించాడు.

## 18. అరుణాచల కవిరాయర్

తిల్లైయాది అనే ఊళ్ళో 1711లో అరుణాచలకవిరాయర్ పుట్టాడు. తండ్రి నల్లతంబి 'రామనాటకం' అనే సంగీత నాటకాన్ని కవిరాయర్ రచించాడు. ఇందులో కీర్తనలు తమిళనాడులో ప్రతీఇంట వినిపిస్తూంటాయి.

## 19. పైడాల గురుమూర్తి శాస్త్రి

వెయ్యి గీతాలు, చాలా కీర్తనలు రచించినవాడు గురుమూర్తి శాస్త్రి. తెలుగు బ్రాహ్మణుడు. వెయ్యిగీతాలు గురుమూర్తి శాస్త్రి అని పేరుండేది. మదరాసులో ఉండేవాడు. 18వ శతాబ్దాని చెందినవాడు. ఈయనగురువు వెంకటసుబ్బయ్య.

## 20. రామనాథపురం శ్రీనివాసయ్యంగార్

పట్నం సుబ్రహ్మణ్యాయ్యర్ శిష్యులు రామనాథపుర శ్రీనివాసయ్యంగార్. ఈయనకే పూచి అయ్యంగార్ అనే పేర కూడా ఉంది. 16-8-1860లో పాపానకుళంలో పుట్టారు చిన్నతనంనుంచీ సంగీతం అంటే ఎంతో ఇష్టం పట్నం సుబ్రహ్మణ్యాయ్యర్ దగ్గర సంగీతం నేర్చుకొని, పెద్దవిద్వాంసు కచేరీలు వింటూండేవారు.

శ్రీనివాసయ్యంగార్ కచేరీలు అన్నీ అద్భుతంగా ఉండేవి రామనాథపుర ఆస్థాన విద్వాంసులుగా ఉండేవారు. ఈయన ముద్ర 'శ్రీనివాస'. కృతులు, వర్ణాలు, జావళీలు, తిల్లానాలు కూడ రచించారు. మోహన, కానడ, పూర్వికల్యాణి, కేదారగౌళ శుద్ధసావేరి, దేవమనోహరి, తోడి, ఆనందభైరవి, మధ్యమావతి

అనే అపురూపమైన తాళంలో తిల్లానా రచించారు. ఈయన శిష్యులే శ్రీ అరియకుడి రామానుజయ్యంగార్.

ఒకసారి అరటి తొక్క పైన కాలువేసి జారిపడితే కాలు విరిగింది అయ్యంగార్‌కి. వైద్యులు వైద్యం చేయలేక పోయారు. అప్పుడు 'నరగున పాలింప' అనే కేదారగౌళరాగంలో కీర్తన రచించి, పాడేసరికి కాలు నయం అయ్యింది.

అయ్యంగార్ వంద దాకా రచనలు చేశారు. ఈయన వర్ణాలలో మోహనరాగంలో 'నిన్నుకోరి' కానడరాగంలో, 'నెరనమ్మితి నయ్యా' ఇవి బాగా ప్రచారంలో ఉన్నాయి. 'ఫరజ్', తోడి, పూర్ణచంద్రిక రాగాలలో అయ్యంగారి తిల్లానాలు కచేరీలో తరుచు వినపడతాయి. శుద్ధసావేరి రాగంలో 'సామజవరదా' పూర్వికల్యాణిలో 'పరమపావనరామ', కేదారగౌళలో 'నరగున పాలింప' దేవమనోహరిలో 'నీకెలనాయడ నిశ్చలము' బేగడలో 'అనుదిన మును గావుమయ్య' కీర్తనలు బాగా ప్రచారంలో ఉన్నాయి. బేహాగ్‌లో 'నిరుపమానసామినినా' సురటిరాగంలో 'వేగనీవు వాని రమ్మనవే' చాలా ప్రచారంలో ఉన్నాయి. 1919లో అయ్యంగార్ మరణించారు.

# 21. సుబ్బరామ దీక్షితులు

కర్ణాటక సంగీత త్రిమూర్తులలో ఒకడైన ముత్తుస్వామి దీక్షితార్ సోదరుడు బాలుస్వామి దీక్షితార్. ఈయన ఎట్టియాపురం సంస్థానంలో సంగీతవిద్వాంసుడిగా ఉండేవాడు. ఈ బాలు స్వామి దీక్షితార్ కూతురు కొడుకు సుబ్బరామదీక్షితార్. అంటే సుబ్బరామ దీక్షితార్ ముత్తుస్వామి దీక్షితార్‌కి మనుమడు అన్న మాట ఆయన 1 లో పుట్టాడు. తల్లి తండ్రులు అన్నపూర్ణ, శివరామ సుబ్బరామ దీక్షితుల్ని బాలుస్వామి దీక్షితార్ దత్తత తీసుకొన్నాడు సంగీతం బాగా నేర్పాడు. ముఖ్యంగా వీణ వాయించడం నేర్పాడు సుబ్బరామ దీక్షితులు తెలుగు, సంస్కృతం, సంగీతం బాగ నేర్చుకొన్నాడు. 'సంగీత సంప్రదాయ' ప్రదర్శిని' అనే గ్రంథ రాశాడు. ఇందులో ఈయన రచించిన వర్ణాలు, కీర్తనలు ఉన్నాయి ఎట్టయాపురం రాజాస్థానంలో సుబ్బరామ దీక్షితులు కూడా ఆస్థా విద్వాంసుడిగా ఉండేవాడు. సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో ఎన్నో ముత్తుస్వామి దీక్షితార్‌కృతులు కూడా ఉన్నాయి. ఇవన్నీ స్వరంతో సహాఉన్నాయి. 'సంప్రదాయ ప్రదర్శిని'ని 1 లో మొదటి సారి ప్రచురించారు. 1 లో సుబ్బరామ దీక్షితా మరణించాడు.

# 22. మహావైద్య నాథయ్యార్

1 - 1893 మధ్యకాలంలో వాడు మహావైద్యనాథయ్యార్. తంజావూరు దగ్గర ఒక చిన్న గ్రామంలో పుట్టారు. 'ఆనయ్య' అనే ఆయన దగ్గర సంగీతం బాగా నేర్చుకొన్నాడు. ఆ తరువాత త్యాగయ్య శిష్యుడైన మానాంబుచావడి వెంకటు సుబ్బయ్య దగ్గర కూడా సంగీతాన్ని అభ్యసించాడు. వైద్యనాథయ్యార్ తండ్రి పంచనదయ్యార్ కూడా గొప్పగాయకుడు.

వైద్యనాథయ్యార్‌కు 'మహా' అన్నది బిరుదు. 'మహా' అంటే గొప్ప అని. చాలా పెద్ద విద్వాంసుల సమక్షంలో వైద్యనాథయ్యాకు 12వ ఏట ఈ బిరుదును ఇచ్చారు. ఏడవ ఏటనే 'రాగం, తానం, పల్లవి' పాడే నైపుణ్యాన్ని సంపాదించుకొన్నాడు వైద్యనాథయ్యార్.

మైసూరు, తిరునాన్కూరు, కొచ్చిన్ రాజుల దగ్గర కచేరీలు చేసి వాళ్ళ చేత ఎన్నెన్నో బహుమానాలు, సన్మానాలు అందుకొన్నాడు వైద్యనాథయ్యార్ 'వేణు' అనే విద్వాంసుణ్ని, 'సింహనందన' అనే తాళంలో పల్లవిపాడి ఓడించాడు. ఈ సింహనందన తాళంలో తిల్లానా కూడా రచించాడు. తమిళంలో చాలా కీర్తనలు రాసాడు. 72 మేళకర్త రాగాల మాలికను రచించాడు. 72 మేళకర్త రాగమాలిక అంటే ఏమిటో చూద్దాం. మేళకర్త రాగాలు 72 ఉన్నాయని చెప్పుకొన్నాం కదా! ఈ రచనలో 72 మేళకర్తరాగాలు అన్నీ వస్తాయి. అంటే ఒక్కొక్క చరణం ఒక్కొక్కరాగంలో ఉన్నాయి.

# 23. మైసూర వాసుదేవాచార్య



'బ్రోచేవారెవరురా' అన్న ఖమాస్ రాగకీర్తన అం
బాగా పరిచయం ఉన్న కీర్తన, దీనిని రచించినది మైః
వాసుదేవాచార్య. ఈయన మే 28, 1865 లో పుట్టాడు. ఈ
సుబ్రహ్మణ్యాచార్య ఈయన మైసూరు రాజాస్థానంలో పుర
చెప్పేవిద్వాంసుడు. వాసుదేవాచార్య తండ్రి చిన్న తనం
మరణించాడు. వాసుదేవాచార్య తన తాత గోపాలాచార్య ద
పెరిగాడు. 'వాసు' తాత గొప్ప సంస్కృత పండితుడు. 'వా
సంస్కృతం, సంగీతం చక్కగా నేర్చుకొన్నాడు. మొదట్లో సం
వీణ పద్మనాభయ్య దగ్గర నేర్చుకొన్నాడు. ఆ తరు
తిరువయ్యారు వచ్చి పట్నం సుబ్రహ్మణ్యయ్యార్ దగ్గర సం
నేర్చుకొన్నాడు.

నెరవల్ చాలా గొప్పగా పాడేవాడు. ప్రతీ శుక్రవారం తన ఇంటిలో భజన ఏర్పాటు చేసేవారు. 1920 ప్రాంతంలో ఒకసారి శహన రాగాన్ని అద్భుతంగా గంటన్నర సేపు గానం చేశాడు. శిష్యులకు ఎంతో సహనంతో, శ్రద్ధతో విద్యచెప్పేవాడు. శిష్యుల్ని స్నేహితుల్లా చూసేవాడు.

వాసుదేవాచార్య రెండు వందల రచనలు చేశాడు. ఆయన రచనల్ని ఆయనే ప్రచురించారు. వర్ణాల్ని, కీర్తనల్ని, తిల్లానాలు కూడా రాశారు. ఈయన రచనల్లో వంద రాగాలు వాడారు. 'మేఘరంజని' లాంటి అపురూప రాగాలలో కూడా ఈయన రచనలు చేశాడు. కొన్ని రచనలు తెలుగులోను, కొన్ని సంస్కృతంలోను చేశాడు. 'అభినవత్యాగరాజు' అని అంతా పొగిడేవారు.

వాసుదేవాచార్యకు 'సంగీతశాస్త్రరత్న' 'సంగీత సాహిత్య విద్వాన్ మణి' 'సంగీతకళాకోవిద' లాంటి బిరుదులు ఉండేవి. 1935లో మద్రాస్ మ్యూజిక్ అకాడమీ 'సంగీతకళానిధి' బిరుదును ఇచ్చి సత్కరించింది. 1959లో భారత ప్రభుత్వం 'పద్మభూషణ' అవార్డును ఇచ్చింది. మే 17, 1961లో వాసుదేవాచార్య మరణించాడు.



# 24. హరికేశ నల్లూర్ ముత్తయ్యా భాగవతార్



**15-11-1877** పూనల్‌వెల్లి అనే ఊరిలో పుట్టాడు. ముత్తయ
భాగవతార్ తండ్రి లింగం అయ్యర్, తల్లి ఆనందమ్మాళ్. ఆరే
వయసులో ముత్తయ్యా తండ్రి మరణించాడు. లక్ష్మణసూ
ముత్తయ్యాకు మేన మామ. ఆయన హరి కేశ నల్లూర్‌లో ఉండేవాడ
ముత్తయ్యాను చేరదీసి ఈయనే పెంచాడు. సాంబశివయ్యర్ దగ్
సంగీతం నేర్చుకొన్నాడు ముత్తయ్యా. 1   లో కచేరీలు చేయ
ప్రారంభించాడు. 1   లో తిరువాన్‌కూర్ మహారాజా ఆస్థానం
కచేరీచేసి, సన్మానాలు పొందాడు. అలాగే ఎట్టయాపు
జమిందారులచేతకూడా సన్మానాలు అందుకొన్నాడు **1927**
మైసూరురాజు చేత సన్మానం పొందాడు. 'గాయక శిరోమ

దేవి పైన, శివుడిపైన కీర్తనలు రాశాడు. ముత్తయ్యా కీర్తనలేకాకుండా వర్ణాలు, రాగమాలికలు, ఎన్నో రాశాడు మద్రాసులో మ్యూజిక్ అకాడమీని స్థాపించిన వారిలో ముత్తయ్యాభాగవతార్ ఒకడు. **1930**లో అకాడమీ 'సంగీతకళానిధి' బిరుదును ఇచ్చి సత్కరించింది. గోటువాద్యం నారాణయ్యార్, టి.ఎల్. వెంకట్రామయ్యార్, మధురైమణి అయ్యార్, బుడలూర్ కృష్ణశాస్త్రి మొదలైనవాళ్ళంతా ఈయనశిష్యులే.

ముత్తయ్యా భాగవతార్ నాలుగు వందల దాకా కృతులు రాశాడు. ప్రచారంలో ఉన్న రాగాల్లోనేకాకుండా, కొన్ని అపురూప రాగాలలో కూడా కృతులు రాశాడు. 'హంసానంది' అనేరాగం హిందుస్థానీ రాగం. దీనిని మన కర్ణాటక సంగీతంలోకి ముత్తయ్యా తీసుకొచ్చాడు. ఈ రాగంలో 'నీదుమహిమపొగడ' అనే కీర్తన రాసాడు. ఇది బాగా ప్రచారంలో ఉంది. మోహన కల్యాణి, గౌడమల్హారు, వలజి రాగాలలో కీర్తనలు రాశాడు. ఆరాగాలు బాగా ప్రచారంలోకి వచ్చేందుకు కృషి చేశాడు. అంతేకాదు. ఇరవైకి పైగా కొత్తరాగాలు కనుగొన్నాడు. ఈ కొత్తరాగాల్లో కీర్తనలు కూడా రచించాడు. పశుపతిప్రియ, బుధమనోహరి, విజయనాగరి, కర్ణరంజని ఇవి ఈయన కనుగొన్న కొన్ని కొత్తరాగాలు, తెలుగు, సంస్కృతం, తమిళం, కన్నడ భాషలలో కీర్తనలు రచించాడు. ఈయన ముద్ర 'హరికేశ'.

## 25. సారంగపాణి

క్షేత్రయ్యలా పదాలను రాసిన వాగ్గేయకారుడు సా
పాణి. 17వ శతాబ్దంలో చిత్తూరు జిల్లాలో కార్వేటి నగ
ఉండేవాడు. సంస్కృత, తెలుగు భాషల్లో పండితుడు. క్షేత్రయ్య
మువ్వగోపాలుడి భక్తుడు. ఈయన పదాలలో 'వేణుగోపాల'
ఉంటుంది. సుమారు రెండు వందల పదాల్ని ఈయన రచించ

## 26. పాపనాశన్ శివన్



1890లో పాపనాశన్ శివన్ తమిళనాడులో పోలగమ్
ఊళ్ళో పుట్టాడు. తల్లియోగాంబాళ్, తండ్రి రామమూర్తి అయ
పాపనాశన్ శివన్‌కు ఆరేళ్ళున్నప్పుడు తండ్రి మరణించాడు.
చిన్నతనంలోనే సంస్కృతం బాగాచదువుకొన్నాడు. చిన్నతన
చక్కనిగొంతుతో బాగాపాడేవాడు. కోనేరిరాజపురం వైద్యనాథం

తమిళంలోను కీర్తనలు రాశాడు. ఈయనను' తమిళ త్యాగరాజు' అని పిలచేవారు. ప్రసిద్ధరాగాలు అన్నింటిలోను కీర్తనలు రచించాడు. నవరస కన్నడ, బిలహంస, తిలంగ్, మాండ్ లాంటి రాగాలలో కూడా రచనలు చేశాడు. కొన్ని సినిమాలకి సంగీతం కూర్చాడు. కొన్ని సినిమాలలో నటించాడు కూడా. 83 వ ఏట మరణించాడు.

## 27. తూమునరసింహదాసు

**1753 - 1820** మధ్య ప్రాంతంలో ఉన్న వాగ్గేయకారుడు తూము నరసింహదాసు. తెలుగు బ్రాహ్మణుడు రామభక్తుడు, తల్లితండ్రులు వెంకమాంబ, అప్పయ్యామంత్రి. గుంటూరు జిల్లాలో ప్రభుత్వోద్యోగిగా ఉండేవాడు. నరసింహదాసు తన ఇంట భజనలు, సంకీర్తనలు జరిపేవాడు. భద్రాచలంలో రాముణ్ని దర్శించుకొని, 'దాశరథితో సరిదైవ మేడ' అన్న కీర్తన జింగ్లారాగంలో రాశాడు. శ్రీరంగ పట్నం వెళ్ళి అక్కడ శ్రీరంగనాథుడిపైన 'కస్తూరి రంగ ననుకావవయ్యా' అన్న కీర్తన తోడిరాగంలో రాశాడు. అలాగే 'రంగనిసేవింప' అనే దేవగుప్తి రాగంలో కీర్తన రాసాడు. కంచి వెళ్ళి అక్కడ శహన రాగంలో 'వరదునిగంటి కంచి వరదునిగంటి' అనేకీర్తన రాశాడు. తిరువయ్యార్‌లో త్యాగరాజ స్వామిని కలుసుకొన్నాడు. త్యాగయ్యా రామభక్తిని చూసి ఎంతో పరవశించాడు తూము నరసింహదాసు.

నరసింహదాసు రచించిన కీర్తనలు ఐదు వందల దాకా ఉన్నాయి. 'భజన చేసే విధము తెలియండి' అనే సౌరాష్ట్రరాగ కీర్తన, 'సెలవమాకికో అన్న యదుకుల కాంభోజికీర్తన,

నరసింహదాసు 45 రాగాల్ని తనకీర్తనల్లో వాడాడు. ఆ
బాగా ప్రచారంలో ఉన్న యదుకుల కాంభోజి,
నాదనామక్రియ, పున్నాగవరాళి, కాపి, కేదారగౌళ,
భూపాల, ముఖారి, మోహన లాంటి రాగాలు వాడాడు.

ఇది వరకు భజన గోష్ఠులలో ఈయనకీర్తనలు బాగా
భద్రాచలంలో రోజూ రాముడి పూజచేసేటప్పుడు ఈయన
పాడుతూంటారు. రేడియోలో ఉదయం పూట వచ్చే
కార్యక్రమంలో ఈయన కీర్తనలు అప్పుడప్పుడు వినిపిస్తాం

## 28. మునిపల్లె సుబ్రహ్మణ్యకవి

రామాయణ కథని కీర్తనల రూపంలో రాసిన వాగ్గేయ
మునిపల్లె సుబ్రహ్మణ్యకవి. కృష్ణా జిల్లాలో ఉన్న ము
1730 - 1780 ప్రాంతంలో ఉండేవాడు. ఈయన నూట
కీర్తనలు రచించాడు. సావేరి, శుద్ధసావేరి, కల్యాణి,
కేదారగౌళ, ముఖారి, సౌరాష్ట్ర ఆనందభైరవి, నాటలాం
రాగాలలో ఈయన కీర్తనలున్నాయి. ఈయన కీర్తనల్ని
రామాయణ కీర్తనలు అంటారు.

## 29. అల్లూరి వెంకటాద్రిస్వామి

కృష్ణజిల్లా అల్లూరులో 1807లో జన్మించిన
స్వామి తల్లితండ్రులు వెంకమాంబ, వెంకయ్య. దక్షిణ భార
ఉన్న చాలా దేవాలయాలను దర్శించి వెంకట్రాది స్వామి

దేవతలపైన కల్పనలు రచించాడు. కంచిలో చాలా రోజులున్నాడు. అక్కడ వరద రాజస్వామి, పైన ఎన్నో కీర్తనలు రచించాడు. ఈయనకీర్తనల్లో 'కస్తూరి రంగ కరుణింపవయ్యా' 'మ్రొక్కెదరారా మోహనరంగా', 'మేలుకో శ్రీరంగనాథ దయానిధే' లాంటి ఈయన కీర్తనలు ప్రచారంలో ఉన్నాయి.1877లో మరణించిన వెంకటాద్రి స్వామి మరణించేముందు సన్యాసం తీసుకొన్నాడు. నలభై రాగాలలో రచనలు చేశాడు.

ఇలా ఎందరెందరో వాగ్గేయకారులు ఉన్నారు. కొందరు ముఖ్యమైన వాగ్గేయకారుల జీవిత చరిత్రలు మీకు చెప్పాను. ప్రత్యేకంగా వాగ్గేయకారుల జీవితచరిత్రలు కొన్ని పుస్తకాలలో ఉంటాయి. అవి చదివితే మీకు ఇంకా చాలామంది వాగ్గేయకారుల జీవిత చరిత్రలు తెలుస్తాయి. ఇటీవల కాలంలో శ్రీరాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, శ్రీ జి.యన్. బాలసుబ్రహ్మణ్యం, శ్రీ ఓగిరాల వీర రాఘవశర్మ, శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ, శ్రీ ఎన్.సి.హెచ్. కృష్ణమాచార్యులు, శ్రీలాల్గుడిజయరామన్ లాంటి వారు కూడా ఎన్నో సంగీత రచనలు చేశారు.

కచేరీలకి వెళ్ళినప్పుడు, విద్వాంసులు పాడే కీర్తన ఏ రాగంలో ఉందో, ఏ తాళంలో ఉందో ఒక పుస్తకంలో రానుకోమని చెప్పాను గుర్తుందా. అలా రానుకొనే టప్పుడు ఆ సంగీతరచన రచించిన వాగ్గేయకారుడి పేరుకూడా ఎవరినైనా అడిగి తెలుసుకొని రానుకోండి. అలా చేస్తే వివిధ వాగ్గేయకారుల రచనలతో మీకు పరిచయం ఏర్పడుతుంది. వాగ్గేయకారుల జీవితచరిత్రలు, బొమ్మలు, సేకరించండి, వాగ్గేయకారుల బొమ్మలతో ఆల్బమ్‌ను తయారు చేయండి. సరేనా?



# సంగీత విద్వాంసులు

వాగ్గేయకారుల జీవిత చరిత్రల్ని మనం చెప్పుకొ
ఈ వాగ్గేయకారులే కాకుండా, గాత్ర విద్వాంసులు, వైలెన్,
వేణువు, నాగస్వరం, మృదంగం, ఘటం ఇలా వివిధ వాద
నిపుణులైన విద్వాంసులు ఎందరెందరో ఉన్నారు.
కొంతమంది పేర్లు, వారు దేనిలో నిపుణులో తెలుసుకొందా

ఇంచుమించు 20వ శతాబ్దం ప్రారంభం నాటికి
విద్వాంసుల పేర్లు ముందు తెలుసుకొందాం.

1. నయానా పిళ్లై (గాత్రం)
2. దక్షిణామూర్తి పిళ్లై (మృదంగం)
3. సీతారామయ్యర్ (మోర్‌సింగ్)
4. అళహనంబి (మృదంగం)
5. తిరుక్కోడి కావల్ కృష్ణయ్యరు (వైలెన్)
6. చిదంబర భాగవతార్ (గాత్రం)
7. పొన్నయ్య పిళ్లై (గాత్రం) (వాగ్గేయకారుడు)
8. టైగర్ వరదాచారి (గాత్రం)
9. సటేశయ్యర్ (గాత్రం)
10. కారైకుడి సాంబశివయ్యరు (వీణ)
11. పల్లడం సంజీవరావు(వేణువు)
12. శరభశాస్త్రి (వేణువు)

14. అనంతరామ భాగవతార్ (గాత్రం)

15. అశ్వధాటి రామమూర్తి (మృదంగం)

16. బలిజేపల్లి సీతారామయ్య (గాత్రం)

17. కడప రామసుబ్బయ్య (గాత్రం)

18. నుసర్ల దక్షిణామూర్తి శాస్త్రి (గాత్రం)

19. పాప వెంకట్రామయ్య (వైలెన్)

20. అరియకుడి రామానుజయ్యంగార్ (గాత్రం)

21. మహారాజపురం విశ్వనాధయ్యర్ (గాత్రం)

22. మధురై శ్రీరంగం అయ్యంగార్ (గాత్రం)

23. ముసిరి సుబ్రహ్మణ్యయ్యర్ (గాత్రం)

24. జి. యన్. బాల సుబ్రహ్మణ్యం (గాత్రం)

25. చిత్తూరు సుబ్రహ్మణ్య పిళ్లే (గాత్రం)

26. మధురై మణి అయ్యర్ (గాత్రం)

27. గోటు నారాయణయ్యంగార్ (గోటు)

28. మైసూర్ టి. చౌడయ్య (వైలెన్)

29. మైసూర్ టి. గురురాజప్ప (వైలెన్)

30. పాల్ఘాట్ మణి అయ్యర్ (మృదంగం)

31. పళని సుబ్రహ్మణ్యపిళ్లే (మృదంగం)

32. స్వామినాధ పిళ్లే (వేణువు)

33. ఆర్. కె. వెంకట్రామ శాస్త్రి (వైలెన్)

34. మహావాది వెంకటప్పయ్య (గాత్రం)

36. మునుగంటి వెంకట్రావు పంతులు (గాత్రం)

37. వంకదారి వెంకట సుబ్బయ్య (గాత్రం, ఫైలెన్)

38. చిలకలపూడి వెంకటేశ్వర శర్మ (గాత్రం)

39. డొక్కా శ్రీరామమూర్తి (గాత్రం)

40. పురాణం కనకయ్యశాస్త్రి (గాత్రం)

41. తాడిగడప శేషయ్య (గాత్రం)

42. పారుపల్లి రామకృష్ణయ్య పంతులు (గాత్రం, ఫైలెన్)

43. శిమిళి సుందరం అయ్యర్ (గాత్రం)

44. పాలఘాట్ రామభాగవతార్ (గ్రాతం)

45. బిడారం కృష్ణప్ప (గాత్రం)

46. బిడారం రాచప్ప (గాత్రం)

47. బి. యస్. రాజయ్యంగార్ (గాత్రం)

48. మైసూర్ దేవేంద్రప్ప (గాత్రం)

49. వాసా వెంకట్రావు (వీణ)

50. నందిగామ వెంకన్న (వీణ)

51. తుమరాడ సంగమేశ్వరశాస్త్రి (వీణ)

52. దుర్వాసుల సోమయాజులు (వీణ)

53. ద్వారం వెంకటస్వామినాయుడు (ఫైలెన్)

54. ద్వారం వెంకట కృష్ణయ్య (ఫైలెన్)

55. పిరాట్ల శంకరశాస్త్రి (గాత్రం)

56. బెంగుళూరు నాగరత్నమ్మ (గాత్రం)

58. గోవిందస్వామి పిళ్ళే (ఫైలెన్)

59. రాజ మాణిక్యం పిళ్ళే (ఫైలెన్)

60. అలత్తూర్ సోదరులు (గాత్రం)

ఇటీవల మరణించిన విద్వాంసులలో కొందరి పేర్లు తెలుసు కొందాం.

1. శ్రీమతి ఎమ్. ఎల్ వసంతకుమారి (గాత్రం)

2. శ్రీ డి.కె. జయరామన్ (గాత్రం )

3. శ్రీ మహారాజపురం సంతానం (గాత్రం)

4. శ్రీ యస్. రామనాథన్ (గాత్రం)

5. శ్రీ ఓలేటి వెంకటేశ్వరులు (గాత్రం)

6. కుమారి శ్రీ రంగం గోపాలరత్నం (గాత్రం)

7. శ్రీ ఎమ్. వి. రమణ మూర్తి (గాత్రం)

8. శ్రీ ఎమ్.డి. రామనాథన్ (గాత్రం)

9. శ్రీ మారెళ్ళ కేశవరావు (ఫైలెన్)

10. శ్రీ మహాదేవ్ రాధాకృష్ణ రాజు (మృదంగం)

11. టి. ఆర్. మహాలింగం (వేణువు)

12. శ్రీ శంకరశాస్త్రి (వీణ)

13. శ్రీ ఎస్. బాలచందర్ (వీణ)

ప్రస్తుతం ఉన్న కొందరు విద్వాంసుల పేర్లు కూడా తెలుసుకొందాం.

1. శ్రీ శ్రీపాద పినాకపాణి (గాత్రం)

3. శ్రీ సెమ్మంగుడి శ్రీనివాసయ్యారు (గాత్రం)

4. శ్రీమతి డి.కె. పట్టమ్మాళ్ (గాత్రం)

5. శ్రీ టి. లోకనాథశర్మ (గాత్రం)

6. శ్రీ టి. ఆర్. సుబ్రహ్మణ్యం (గాత్రం)

7. శ్రీ నూకల చినసత్యనారాయణ (గాత్రం)

8. శ్రీ మంగళం పల్లి బాలమురళీకృష్ణ (గాత్రం, వైలెన్)

9. శ్రీమతి ఎమ్. ఎస్. సుబ్బులక్ష్మి (గాత్రం)

10. రాధ అండ్ జయలక్ష్మి (గాత్రం)

11. హైదరాబాదు సోదరులు (గాత్రం) (డి. రాఘవా
డి. శేషాచారి గార్లు)

12. శ్రీ టి.ఎన్. శేషగోపాలన్ (గాత్రం)

13. శ్రీ కె.వి. నారాయణస్వామి (గాత్రం)

14. శ్రీ సి. చిట్టిబాబు (వీణ)

15. శ్రీ పుదుక్కోట్టై కృష్ణమూర్తి (వీణ)

16. శ్రీ శివానందం, శ్రీమతి శారదా శివానందం (వీణ)

17. శ్రీ లాల్గుడి జయరామన్ (వైలెన్)

18. శ్రీ టి. యన్. కృష్ణన్ (వైలెన్)

19. శ్రీ ఎమ్. ఎస్. గోపాల కృష్ణన్ (వైలెన్)

20. శ్రీమతి టి. రుక్మిణి (వైలెన్)

21. కుమారి ఎ. కన్యాకుమారి (వైలెన్)

22. శ్రీమతి రాజేశ్వరీ పద్మనాభన్ (వీణ)

24. సిక్కిల్ సల, కుంజుమణి (ఫ్లూటు)

25. శ్రీ రవికిరణ్ (గోటు)

26. శ్రీ అల్లం దుర్గాప్రసాద్ (గోటు)

27. శ్రీ ద్వారం దుర్గాప్రసాదరావు (వైలెన్)

28. శ్రీ ముళ్ళపూడి శ్రీరామమూర్తి (మృదంగం)

29. శ్రీ ఎమ్.ఎస్. బాలసుబ్రహ్మణ్య శర్మ (గాత్రం)

30. శ్రీ దండమూడి రామమోహనరావు (మృదంగం)

31. శ్రీ కె.వి. ప్రసాద్ (మృదంగం)

32. శ్రీ వినాయకరామ్ (ఘటం)

33. శ్రీహరిశంకర్ (కంజీరా)

34. శ్రీ గురువాయూర్ దొరై (మృదంగం)

35. బొంబాయి సోదరీమణులు (గాత్రం) (శ్రీమతులు సరోజ, లలిత)

36. శ్రీ ఎన్. సి. హెచ్. కృష్ణమాచార్యులు (వైలెన్, గాత్రం)

37. శ్రీ అన్నవరపు రామస్వామి (వైలెన్)

38. శ్రీ మండ బలరామ శర్మ (వేణువు)

39. శ్రీయువటూరి విజయేశ్వరరావు (గాత్రం, వైలెన్)

40. శ్రీ నేతి శ్రీ రామ శర్మ (గాత్రం, వైలెన్)

41. శ్రీ అంపోలు మురళీకృష్ణ (వైలెన్)

42. శ్రీ వి. కమలాకర్ (మృదంగం)

43. శ్రీ మహదేవ్ లక్ష్మీనారాయణ రాజు (మృదంగం)

45. శ్రీ వంకాయల వెంకటరమణ (మృదంగం)

46. శ్రీ కొమాండూరి కృష్ణమా చార్యులు (వైలెన్)

47. శ్రీ పేరి శ్రీరామమూర్తి (వైలెన్)

48. శ్రీ ఆకెళ్ళ మల్లికార్జునశర్మ (వైలెన్)

49. శ్రీ ఎల్లా వెంకటేశ్వరరావు (మృదంగం)

50. శ్రీ దోమాడ చిట్టి అబ్బాయి (నాదస్వరం)

51. శ్రీ ఆర్. కె. సూర్యనారాయణ (వీణ)

52. శ్రీ జయశంకర్ (నాదస్వరం)

53. శ్రీ షేక్ చిన్నమౌలానా (నాదస్వరం)

54. శ్రీ యు. శ్రీనివాస్ (మేండొలిన్)

55. శ్రీ ఎ.కె.సి. నటరాజన్ (క్లారినెట్)

56. శ్రీ వలయపట్టి దండపాణి (జలతరంగిణి)

57. శ్రీ ఆర్.కె. శ్రీకంఠన్ (గాత్రం)

58. శ్రీమతి సుధారఘునాథన్ (గాత్రం)

59. శ్రీమతి నాగమణి శ్రీనాథ్ (గాత్రం)

60. కుమారి బొంబే జయశ్రీ (గాత్రం)

ఇలా చెప్పుకొంటూ ఎందరెందరో వి
ప్రస్తుతం ఉన్నారు. కచేరీలు వింటుంటే మీకు చా
విద్వాంసుల పేర్లు తెలుస్తాయి. విద్వాంసుల ఫోటోలు, జీవి
కూడా సేకరించండి. ఆల్బమ్ తయారుచేయండి.

# కర్ణాటక సంగీతం - ఇతర సంగీతాలు

మన సంగీతానికి, పాశ్చాత్య సంగీతానికి ఉన్న భే
మనం తెలుసుకొందాం. పాశ్చాత్య సంగీతానికి, మన సంగీ
ఉన్న ముఖ్యమైన భేదం - పాశ్చాత్యసంగీతంలో చెవికి ఇం
ఉండే కొన్ని స్వరాల్ని ఏకకాలంలో వినిపింపచే
మనసంగీతంలో అలాకాదు. చెవికి, ఇంపుగా ఉండే స్వ
ఒకదానితరువాత ఒకటి పాడడమో, వాయించడమో చే
పాశ్చాత్యసంగీతంలో పాట పాడడం కన్నా వాద్యాలకే ఎ
ప్రాధాన్యత ఉంటుంది. ఒకేసారి రకరకాల వాద్యాలమీద, రక
స్వరాల్ని వాయిస్తారు. ఒకసారి కొన్ని వాద్యాలు, ఇంక
కొన్ని ఇలా వాయిస్తూంటారు. వాద్యాలన్నింటికీ శృతి
ఒక్కటి ఉండదు.

పాశ్చాత్య సంగీతంలో 'ఆర్కెస్ట్రా' అనేది ఉంట
ఆర్కెస్ట్రా అంటే వాద్యసమ్మేళనం అన్నమాట. ఇరవై నుండి
దాకా వాద్యాల పైన కొన్ని స్వరసమూహాలను ఒకేసారి వాం
వినేవాళ్ళకు ఆనందాన్ని కలిగిస్తారు.

పాశ్చాత్య సంగీతంలో రాగాలు ఉండవు. కేవలం స
సమూహాలే ఉంటాయి. వాళ్ళరచనలు అన్నీ ఎక్కువగా
శంకరాభరణ రాగంలోనే ఉంటాయి. కొన్ని రచనలు వ
మన కీరవాణి, గౌరిమనోహరి రాగాలలో ఉంటాయి. శంకర

అని, గారమనోహరని మలాడకల మైనం స్కేల అని అం

పాశ్చాత్య సంగీతంలో మన కర్ణాటక సంగీ

మనోధర్మ సంగీతం ఉండదు. ఒకళ్ళు సంగీత రచనల్ని

అలా రాసేవారిని 'కంపోజర్' అంటారు. 'కంపోజర్'

చేసిన సంగీతాన్ని వాయిస్తారు లేదా పాడతారు.

అప్పటికప్పుడు తమ కల్పనని ఉపయోగించి పాడడం, వాం

కాని పాశ్చాత్య సంగీతంలో లేదు.

మనం గమకాలను గురించి చెప్పుకొన్నాం. ఈ గ

పాశ్చాత్యసంగీతంలో ఉండవు. గమకంలేకుండా కేవలం స్వ

మాత్రమే పాడతారు లేదా వాయిస్తారు.

కర్ణాటక సంగీతంలో ఎన్నో తాళాలు ఉన్నాయ

చెప్పుకొన్నాం. పాశ్చాత్య సంగీతంలో తాళాలు ఉండవు.

లయ మాత్రమే ఉంటుంది. అందే ఒక క్రియతోనే

కొలుస్తారు.

మనకర్ణాటక సంగీతానికి, పాశ్చాత్యసంగీతానికి

ముఖ్యమైన భేదం ఉంది. మన కర్ణాటక సంగీతం మ

కదిలిస్తుంది. పాశ్చాత్య సంగీత కేవలం మన శరీరాన్ని మ

కదిలిస్తుంది. అందే పాశ్చాత్య సంగీతం వింటే మనకి హ

వచ్చి డాన్స్ చేయవచ్చు. అయితే మన కర్ణాటక సంగీతం

శరీరానికి ఆనందం ఇచ్చేదికాదు. మన సంగీతం మనస్సు

చొచ్చుకొన్ని పోయి, మనకు ఎంతో హాయిని, ప్రశాం

భగవంతుణ్ని చేరవచ్చు. వాగ్గేయకారులు ఎందరోసంగీతం ద
మోక్షాన్ని పొందారు. మరి పాశ్చాత్య సంగీతంలో అల
అవకాశం లేదు.

పాశ్చాత్య సంగీతం ప్రభావం మన సంగీతంపైన
కొద్దిగా ఉంది. 'రమించువారెవరురా', 'రఘువంశ సుధాంబు
-ద్ర శ్రీ', నెనరుంచినారు' ఇలాంటి కొన్ని కృతులు విన్నప్పు
వాటిపై పాశ్చాత్య సంగీత ప్రభావం కొద్దిగా ఉన్నట్లు కనిపిస్తు

పాశ్చాత్య సంగీతం నుంచి వైలెన్ మనకర్ణాటక సంగీతం
వచ్చింది. వైలెన్ ప్రక్కవాద్యంగా వాయించడానికి,
వాయించడానికి ఎంతో బాగుండడంతో మన సంగీతంలో
ఒక భాగం అయిపోయింది. వయోలా, గిటార్, మాండ
ఇవికూడా పాశ్చాత్య సంగీతవాద్యాలు వీటిపైన కూడా
కర్ణాటక సంగీతాన్ని వాయిస్తున్నారు. వయోలా, వైలెన్
ఉంటుంది. ఇది వైలెన్‌కన్నా కొంత సైజులో పెద్దది. న
కూడా ఇంచుమించు వైలెన్ నాదంలాగే ఉంటుంది. దీనితో కొం
ప్రక్కవాద్యం వాయిస్తున్నారు. అలాగే కొందరు సోలో క
కూడా చేస్తున్నారు. మాండొలిన్‌ను మనకర్ణాటక సంగీతం
తీసుకొచ్చినది శ్రీ యు. శ్రీనివాస్ అని మనం ముందేతెలు
న్నాం. అలాగే శ్రీ సుకుమార్ ప్రసాద్, శ్రీ బాలు విశ్వన
మొదలైన వాళ్ళు గిటార్‌పైన కర్ణాటక సంగీతాన్ని వినిపిస్తున్నా
'శాక్సోఫోన్' అనే గాలివాద్యం పాశ్చాత్య సంగీత వాద్యం. దీ

కర్ణాటక సంగీతాన్ని స్వరంతో రాయడానికి పద్ధతులు ఉండేవికావు. ఇలా స్వరంతో రాయడాన్నే నొటేషన్ రైటింగ్ అంటారని ముందు తెలుసుకొన్నాం. పాశ్చాత్యసంగీతాన్ని రాయడానికి పద్ధతులు ఉన్నాయి. వాటి ప్రభావంతో మన కీర్తనలు స్వరంతో రాయడానికి పద్ధతులు ఏర్పడ్డాయి.

మన సంగీతంలో స్వరాల్ని గమకంతో పాడతారు. ఈ గమకాల్ని నొటేషన్‌లో స్పష్టంగా చూపించలేము. కనుక గురువు ద్వారానే మన సంగీతం నేర్చుకోవాలి. అయితే బాగా సంగీతం వచ్చిన విద్వాంసులు ఈ నొటేషన్ సహాయంతో కీర్తనల్ని నేర్చుకోగలుగుతారని ముందే మనం తెలుసుకొన్నాం.

ఇప్పుడు కర్ణాటక సంగీతానికి హిందుస్థానీ సంగీతానికి ఉన్న పోలికలు, భేదాలు గురించి చెప్పుకొందాం. హిందుస్తానీ సంగీతంలో కూడా శృతులు, స్వరస్థానాలు, స్వరాలు మన కర్ణాటక సంగీతంలో ఉన్నట్లుగానే ఉంటాయి. కాని గమకాల్లో, వాద్యాలలో సంగీతరచనల్లో, కచేరీపద్ధతి, మనోధర్మసంగీతం, బోధనా పద్ధతులు, రాగపద్ధతులు మొదలైన వాటిలో వాళ్ళకు, మనకు తేడాలున్నాయి. హిందుస్థానీ, సంగీతం రాజదర్బారులలో పెరిగింది. కర్ణాటక సంగీతం దేవాలయాలతో అభివృద్ధి చెందింది. అందే హిందుస్థానీ సంగీతం కేవలం వినోదప్రధానం. కర్ణాటక సంగీతం వినోదంతో పాటు, మోక్షాన్ని ఇచ్చేసాధనం. కర్ణాటక, హిందుస్థానీ సంగీతాలకు గలతేడాలు చెప్పుకొందాం.

ఉన్నాయని, ఇవేకాకుండా చాలా రకాల గమకాలు వాడతాం అని చెప్పుకొన్నాం. అయితే హిందుస్థానీలో ఇన్ని రకాల గమకాలు ఉండవు. గమకాలు వినగానే అది హిందుస్థానీ సంగీతమో, కర్ణాటక సంగీతమో చెప్పవచ్చు. హిందుస్థానీలో ఎక్కువ గమకం లేకుండా పాడతారు. జారు గమకం (అంటే ఒక స్వరం లోంచి, ఇంకో స్వరంలోకి జారడం) ఎక్కువగా వాడతారు.

వాద్యాలు : హిందుస్థానీలో కూడా శృతికి తంబూరాయే వాడతారు అయితే ఇంకా ఇతర వాద్యాలలో తేడాలున్నాయి. హిందుస్థానీ సంగీతంలో వాడే సారంగి, సరోద్, సంతూర్ మన సంగీతంలో లేవు. అలాగే మన కర్ణాటక సంగీతంలో తాళవాద్యాలు అయిన కంజీరా, మోర్సెంగ్, ఘటం ఇవి హిందుస్థానీలో లేవు. గాత్రానికి ప్రక్కవాద్యంగా మనకర్ణాటక సంగీతంలో వైలెన్ ఉపయోగిస్తారని తెలుసుకొన్నాం. హిందుస్థానీలో ప్రక్కవాద్యంగా సారంగి అనే వాద్యాన్ని కాన్ని, హార్మోనియంను కాని ఉపయోగిస్తారు. సారంగి వైలెన్‌ను పోలి ఉంటుంది. మన వీణలాంటి వాద్యం వాళ్ళకు ఉంది. దానినే సితార్ అంటారు. పూర్వం ధృవవీణ, చలవీణ అని రెండు రకాల వీణలు ఉండేవి. ధృవవీణ అంటే ప్రస్తుతం మనం వాడేవీణ. చలవీణ అంటే మెట్లు కదుపుకోడానికి వీలైన వీణ. అంటే రాగాల్ని బట్టి మెట్లును మార్చుకోవాలన్నమాట. ధృవవీణలో అలా మెట్లును కదపడానికి వీలుండదు. సితార్ చలవీణ అన్నమాట. అంటే రాగాన్ని బట్టి దాని మెట్లను

ఉంటుంది.

మనం సంగీతంలో తాళ వాద్యాలలో ముఖ
మృదంగం అని చెప్పుకొన్నాం. ఈ మృదంగాన్ని
భాగాలుచేస్తే అది 'తబలా' అనేవాద్యం అవుతుంది, ఈ
హిందుస్థానీలో తాళవాద్యం. మృదంగాన్ని రెండు భాగా
ఆ రెండు భాగాలనీ చర్మం మూతలతో మూస్తారు. కు
ఒక భాగాన్ని వాయిస్తారు. దానిని 'తబల' అంటారు.
చేతితో మరోభాగాన్ని వాయిస్తారు. దానిని 'బాయ' అ
మృదంగంకు బోనం పెడతారని తెలుసుకొన్నాం. తబలాకు
పెట్టరు. రెండు భాగాలకీ కర్ణిణి ఉంటుంది. తబలా న
మృదంగ నాదంకి తేడా ఉంది. నాదాన్ని బట్టి ఇది
అని, ఇది మృదంగం అని చెప్పేయచ్చు. మృదంగంపై వచ్చేశ
జతులంటారని చెప్పుకొన్నాం. ఈ జతులని 'త, ధి, గి
తోం, ఝం, కి, ట, త, కొ ఇలా పిలుస్తారు. అయితే 'తబ
వచ్చే శబ్దాల్ని 'నాధింధినాన ధింకిట రిన్న' ఇలా పిలుస్తాం

గోటు, వైలెన్ వాద్యాలపైన కూడా హిందుస్థానీ స
వాయిస్తారు. గోటును విచిత్ర వీణ అంటారు వాళ్ళు.
వేణువుకన్నా వాళ్ళ వేణువులావుగా, పొడవుగా ఉంటుంది.
బాంసురి అంటారు.

మన సన్నాయి కన్నా చిన్నదిగా ఉండే సన్నాయి
వాద్యం హిందుస్తానీలో ఉంది. దానినే 'షెహనాయ్' అంటా

సంగితరచనలు: మనకు ఉన్నన్ని సంగితరచనలు వాళ్ళకు
ద్రుపద్, టుమ్రి, తరానా, గజల్, దాద్రా, ఖవ్వాలి
వాళ్ళ సంగీతరచనల్లో రకాలు. ఇవన్నీ పాడడానికే. వాద్యా
ఇవి వాయించరు. 'జోద్' అనే దానినే వాయిస్తారు.
మనోధర్మ సంగీతం: మన కర్ణాటక సంగీతంలో రాగా
స్వరకల్పన, నెరవు, రాగం, తానం, పల్లవి ఇలాంటి మన
సంగీతానికి సంబంధించిన అంశాలుంటాయని చెప్పుకొన్నాం.
కర్ణాటక సంగీతంలో రాగాలాపన పాడి ఆ తరువాత, సంగీతర
పాడతారని చెప్పుకొన్నాం. అయితే హిందుస్థానీ సంగీ
రాగాన్ని ప్రత్యేకంగా ఆలాపన చెయ్యరు. ఒక చిన్న
తీసుకొని, ఆ పల్లవినే నెరవు పాడినట్లు పాడుతూం
మధ్యమధ్యలో రాగాన్ని పాడతారు. అలా పాడేటప్పుడు రా
వేగంగాను, నెమ్మదిగాను, కూడా పాడతారు. ఇలా తీసు
పల్లవినే 'ఖ్యాల్' అంటారు.

రాగం, తానం, పల్లవి అనేది ప్రత్యేకంగా వాళ్ళకు
స్వరకల్పన కూడా అంతగా ఉండదు హిందుస్థానీలో
బోధనాపద్ధతులు: మన సంగీతం నేర్చుకొనే విదా
సరళీస్వరాలు, జంటస్వరాలు, అలంకారాలు ఇలా నేర్చుకొం
నేర్చుకోడానికి పనికి వచ్చేరచనలు చాలా ఉన్నాయని
చెప్పుకొన్నాం. ఇలాంటివి వాళ్ళకు లేవు. ఇప్పుడిప్పుడే
పద్ధతిలో నేర్పడం వాళ్ళుకూడా మొదలు పెట్టారు.
రాగాలు: హిందుస్థానీలో మేళకర్త, రాగాలు చాలా తకు

ఉన్నాయి. ఉత్తర రాగాలను వాళ్ళు థాట్ అంటారు.
ఉన్న హంసధ్వని, అభోగి, ఖమాస్, శహన రాగాలను
కూడా అదే పేరుతో పిలుస్తున్నారు.

కొన్ని రాగాలను మనం ఒక పేరుతో పిలిస్తే, అదేరా
వాళ్ళు వేరేపేరుతో పిలుస్తున్నారు. హిందోళరాగాన్ని
'మాల్‌కోస్' అంటారు. మోహన రాగాన్ని 'భూపాల'
శంకరాభరణాన్ని 'బిలావల్' అని, శుభపంతువరాళిని 'తోడి'
సింధుభైరవిని, భైరవిఅని; ద్విజావంతిని జై జైవంతిఅని
ఒకేరాగాన్ని మనం ఒకపేరుతో పిలిస్తే వాళ్ళు మరో
పిలుస్తున్నారు.

రాగాలను వాళ్ళు స్త్రీ రాగాలని, పురుష రాగాలని విభజి
అలాంటి పద్ధతి మనకి లేదు.

తాళాలు : హిందుస్థానీలో, మనకి ఉన్నన్ని తాళాలు
హిందుస్థానీగాయకులు చేతితో తాళం వేస్తూ పాడరు.
వాయించేవారు తాళాన్ని చూపిస్తూ వాయిస్తారు. దానిని
పాడేవాళ్ళు పాడతారు. వాయించేవాళ్ళు వాయిస్తారు. 'ఏక్
'తీన్‌తాళ్' అనే తాళాలు వాళ్ళకి ఉన్నాయి.

కచేరీపద్ధతి : మనకచేరీలు తానవర్ణంతో మొదలు అవుతా
ఆ తరువాత వినాయక ప్రార్థన పాడతారని, ఆతరువాత
రచనలు పాడతారని మనం ముందు తెలుసుకొన్నాం. హింద
సంగీత కచేరీలలో విఘ్నేశ్వర ప్రార్థన ఉండదు. కీర్తనలు పా
ఉండదు. ఒక రాగంలో విలంబిత్ ఖ్యాల్ అదే రాగంలో

ఖ్యాల్, ఆ తరువాత అదేరాగంలో తరానా, ఆ తరువాత ఒక భజన్, ఠుమ్రీతో కచేరీ ముగిస్తారు. నాలుగు, ఐదు గంటలు కచేరీ ఉంటుంది. కర్ణాటక సంగీత కచేరీల్లో పది, పదిహేను రాగాలు వినిపిస్తాయి. అయితే హిందుస్థానీ సంగీతచేరీల్లో రెండు, మూడు రాగాలకన్నా ఎక్కువ వినిపించవు.

మన సంగీత కచేరీల్లో వైలెన్, మృదంగాలకి కూడా ప్రాధాన్యత ఉంటుంది. అయితే హిందుస్థానీ కచేరీలలో ప్రక్కవాద్యాలకి ప్రాధాన్యత తక్కువ.

హిందుస్థానీ సంగీతంలో విలంబిత కాలంలో (నెమ్మదిగా పాడేకాలం) ప్రతీ అంశాన్ని పాడతారు. ఆ తరువాతనే వేగంగా పాడతారు. అయితే మన కర్ణాటక సంగీతంలో ప్రత్యేకంగా 'విలంబిత కాలం' వినిపించదు.

ఇలా కర్ణాటక, హిందుస్థానీ సంగీతాలకి చాలాభేదాలు న్నాయి.

# సంగీతం ఎందుకు నేర్చుకోవాలి ఎందుకు వినాలి?

సంగీతం గురించి మనం ఇంతవరకు చాలా నేర్చుకొన్నాం. మీ అందరికీ ఒక సందేహం వచ్చి ఉ అసలు సంగీతం ఎందుకు నేర్చుకోవాలి? ఎందుకు అని.

సంగీతం మనల్ని ఎంతో ప్రభావితం చేస్తుంది. అంతర్గతంగా ఉన్న మృదుస్వభావాన్ని తట్టిలేపి, ... అలవరిచే గుణం సంగీతానికి ఉంది. పిల్లల మానసిక ... సంగీతం దోహదపడుతుంది. సంగీతం నేర్చుకోవడం వ... పనితీరు వేగంవంతమై వ్యక్తిలో ఉన్న శక్తి యుక్తులతో ఏ రంగంలోనైనా రాణించ గలడు. అతనికి అన్ని రంగా... విజయం లభించగలదు.

మనకు చాలా చికాకులు కలుగుతాయి. మనం బాగా పనిచేసి అలిసి పోతూఉంటాం. అలాంటప్పుడ... సంగీతం వింటే ఎంతో మానసిక ప్రశాంతత దొరుకుతుంది. వల్ల ఎన్నో రోగాల నయం అవుతాయని ఇటీవల చేస్తున్న ప... వల్ల తేలింది. రోగాల్ని నయం చేసేందుకు సంగీతాన్ని వి... రోగులకు ఆపరేషన్ చేసేముందు వాళ్ళకు సంగీతం వి... ఇలా చేయడం వల్ల వాళ్ళకు ఆపరేషన్ అంటే ఉన్న పోతుంది. పోటీలలో పాల్గొంటున్న క్రీడాకారులకి గె...

లేదో అనే మానసిక ఒత్తిడి ఉంటుంది. ఈ ఒత్తిడి తగ్గించడా
సంగీతం వినిపిస్తున్నారు. ఎన్నో మానసిక వ్యాధుల్ని పోగొట్టడా
సంగీతం పనికొస్తుందని, పరిశోధనలవల్ల తేలింది.

సంగీతం బాగా నేర్చుకొని, రోజూ భక్తితో, శ్రద్ధ
ఏకాగ్రతతో సాధన చేస్తే మనం భగవంతుణ్ని చేరవచ్చు. త్యాగయ
రామదాసు, పురందరదాసు, శ్యామశాస్త్రి, అన్నమయ్య ఇ
ఎందరెందరో వాగ్గేయకారులు సంగీతంతో మోక్షం పొందా
మోక్షం పొందడానికి సంగీతం చాలా సులువైన మార్గం.

ప్రపంచంలో ఉన్న అన్ని సంగీతాలలోకి మన కర్ణా
సంగీతం చాలా గొప్పది. మనకి ఉన్నన్ని రాగాలు, తాళా
ఇన్ని సంగీతరచనలు మరి ఏ ఇతర సంగీతాలలోనూ కనిపించ
ఎందరెందరో వాగ్గేయ కారులు మన సంగీతాన్ని బాగా అభివృద్ధి
మనకు అందించారు. సంగీతం వాళ్ళు మనకి ఇచ్చిన వ
ఒక అమూల్య సంపద. ఎక్కడైనా బాగా పాత శిల్పా
దేవాలయాలు ఉంటే వాటిని మనం రక్షించు కొంటాం క
ప్రభుత్వం వాటిని కాపాడడానికి చర్యలు తీసుకొంటుంది. అ
మనకు ఎంత కాలంగానో వస్తున్న సంగీతాన్ని కూడా మ
కాపాడుకోవాలి. సంగీతాన్ని కాపాడుకోవాలంటే మనమ
సంగీతం నేర్చుకోవాలి. మనం సంగీతాన్ని నేర్చుకొని తరు
తరానికి అందించాలి. ఇలా ఒకతరం నుంచి మరోతరా
సంగీతాన్ని అందించినప్పుడే అది నిలుస్తుంది. అయితే అంద
సంగీతం నేర్చుకోలేరు. కొందరు మాత్రమే సంగీతం చక్క
పాడగలరు. కొందరు చక్కగా వాద్యాల్ని వాయించగల్గుతా

సంగీతం నచ్చి కన్నవాళ్ళు పిల్లలకు తొందరగా వచ్చేస్తుంది. అందరూ సంగీతం నేర్చుకోలేకపోయినా సంగీతం వినే అలవాటైనా చేసుకోవాలి. విద్వాంసులు చేయాలంటే వినేవాళ్ళు కూడా ఉండాలి కదా! వినేవా కచేరి ఎవరకోసం చేస్తారు? అందుచేత సంగీతం వినే చేసుకోవాలి. తల్లి, తండ్రులు, తమ పిల్లలకు చిన్నతన రామదాసు, అన్నమయ్య, కీర్తనలు లాంటివి ( వినిపించాలి. రేడియోలో వచ్చే 'భక్తిరంజని' కార్యక్రమాన్ని వినే అలవాటు పిల్లలకు కలిగించాలి. ఇలా చేయడం వల్ల సంగీతం అంటే ఆసక్తి ఏర్పడుతుంది. వాళ్ళుకూడా పాడ ఏదైనా వాద్యం నేర్చుకోడానికో ఉత్సాహం చూపిస్తారు. తల్లిదండ్రులు వాళ్ళను ప్రోత్సహించి, సంగీతం నేరి చిన్నప్పటి నుంచీ మంచి సంగీతం వినిపించడం వల్ల పెద్ద మంచి సంగీతాన్ని విని ఆనందించగల్గుతారు. కొందరు విద్వాంసులుగా తయారు అవుతారు. ఇలా సంగీతం ఒక త మరొక తరానికి అందుతుంది. ఇలా ఒకతరం నుంచి మరొ సంగీతాన్ని అందిస్తూ దాన్ని కాపాడుకోవడానికి మనం నేర్చుకోవాలి. వినాలి. చివరిగా సంగీతం నేర్చుకోవ మరో ప్రయోజనం ఏమిటంటే - సంగీత విద్వాంసులుగా అయ్యి కచేరీల వల్ల డబ్బు పేరు సంపాదించుకోవచ్చు. రేడియోలోను సంగీత కళాశాలల్లోనూ, పాఠశాలల్లోనూ ఉద సంపాదించు కోవచ్చు. ఈ కారణాల వల్ల సంగీతం నేర్చు వినాలి.

# సంగీతం ఎలా వినాలి?

మనం సంగీతం గురించి చాలా విశేషాలు చెప్పుకొన
సంగీతం నేర్చుకోవాలసిన ఆవసరాన్ని కూడా గుర్తించాం. ఎ
సంగీతం ఎలా వినాలి? ఎలా నేర్చుకోవాలి? అని మీకు సంగ
వచ్చిందా? ఇప్పుడు మనం సంగీతం ఎలా విని, ఆనందిం
తెలుసుకొందాం.

సంగీతం వినడం వల్ల బ్రహ్మానందం కలుగుత
బ్రహ్మానందం అంటే అంతులేని ఆనందం. ఎప్పుడు సం
విన్నా ఆనందమేకలుగుతుంది కాని, ఆనందం కలగక పో
అన్నది ఉండదు. అయితే ఈ బ్రహ్మానందం అందరికీ కల
భగవంతునిపై ఎంతో భక్తి ఉన్నవాళ్ళకే కలుగుతుంది. త్యాగ
దీక్షితార్, రామదాను, పురందరదాసు, అన్నమయ్య, శ్యామ
లాంటి వాగ్గేయకారులు ఎందరో సంగీతంతో బ్రహ్మా
పొందారు. మనం కూడా సంగీతంతో బ్రహ్మానందం పొంద
ప్రయత్నించాలి. భగవంతుడిపై భక్తిని పెంపొందించుకొని బ్ర
సంగీతం వినాలి.

కచేరీకి వచ్చే శ్రోతలు చాలా రకాలుగా ఉంటారు. సం
బాగా వచ్చిన విద్వాంసులు, సంగీతం తెలియని సాధారణ
శ్రోతలు, సాహిత్యం బాగాతెలిసి, సంగీతం కొంత తె
సాహిత్యవేత్తలు ఇలా చాలా రకాల శ్రోతలు ఉంటారు.
సంగీతం నేర్చుకొనే విద్యార్థులు కూడా కచేరీలకు వస్తారు.

గాయకుడు లేదా గాయకురాలి గొంతు బాగున్నా,
ఉన్న కీర్తనలు పాడుతున్నా, స్వరకల్పన వేగంగా
బాగా తెలుసున్న కీర్తనలు పాడుతున్నా, రాగాలాప
చేస్తున్నా, హెచ్చు స్థాయిలో రాగాన్ని ఆలపిం
మెచ్చుకొంటారు. సాహిత్యం బాగా తెలిసున్న వాళ్ళు
సాహిత్యం సరిగా ఉచ్చరిస్తున్నారా? లేదా? పదా
విడదీస్తున్నారా లేదా! మొదలైన విషయాలు గమనిస్తారు

ఇంక సంగీతం బాగా వచ్చిన విద్వాంసులు ఎలా
చూద్దాం. గాయకుడు చక్కగా శృతిలోపాడుతున్నా
మంచి లయజ్ఞానం ఉందా? లేదా? అని ముందు
కీర్తనల్లో మంచి సంగతులు పాడినా, రాగాలాపనను బాగ
స్వరకల్పన కొత్త పద్ధతుల్లో చేసినా విద్వాంసులు మెచ్చు
అలాగే కష్టమైన తాళాలలో రాగం, తానం, పల్లవి,
'భేష్' అంటారు. విద్వాంసులు వీటన్నింటిని మించి
గమకాలతో పాడుతున్నాడా? లేదా? అని కూడా
సాధారణంగా కచేరీలలో వినిపించని మారుమూల రాగా
పాడినా విద్వాంసులు మెచ్చుకొంటారు. ఇలా విద్వాంస
చాలా రకాలుగా పరిశీలిస్తూ వింటారు.

సంగీతం నేర్చుకొనే విద్యార్థులు కూడా కచేరీ
చాలా జాగ్రత్తగా పరిశీలిస్తూ వినాలి. రాగాలాపన ఎలా
స్వరకల్పన ఎలా చేశారు? గమకాల్ని ఎలా
ఇస్తున్నారు? ఏరాగం తరువాత ఏరాగం పాడుతునా

అంశాల్ని సంగీతం నేర్చుకొనే విద్యార్థులు జాగ్రత్తగా పరిశీలిస్తూ వింటే ఎన్నెన్నో కొత్త విషయాల్ని వాళ్ళు నేర్చుకోగల్గుతారు. రాగాలాపన వినడం వల్లనే పట్టుపడుతుందని చెప్పుకొన్నాం. అందుచేత రాగాలాపనల్ని శ్రద్ధగా విద్యార్థులు వినాలి.

ఈ పుస్తకం చదవడం వల్ల సంగీతం గురించి మీకు కొంత అవగాహన అయిఉంటుంది. అందుచేత నెమ్మదిగా సంగీతం వినడం అలవాటు చేసుకోండి. మొదట్లో మీరు సాధారణ శ్రోతగానే ఉండవచ్చు. కాని నెమ్మది నెమ్మదిగా సంగీతం గురించి ఎన్నో విషయాల్ని అర్థం చేసుకొన గలిగే స్థితికి మీరు ఎదగగల్గుతారు.

సంగీతం ఎలా వినాలి అని మనం చర్చిస్తూ కూర్చోవడం కన్నా సంగీతాన్ని వింటే మీకే తెలుస్తుంది. అందులో ఉన్న ఆనందం ఏమిటో 'ఈ లాగని వివరింపలేను చాలా స్వానుభవైక వేద్యము' అన్నాడు త్యాగరాజు. సంగీతం వినడం వల్ల వచ్చే ఆనందం ఇంత అని మనం చెప్పలేం. ప్రతి ఒక్కరూ సంగీతం విని స్వయంగా అందులో ఆనందాన్ని అనుభవిస్తేనే తెలుస్తుంది ఆ ఆనందం ఏమిటో. మరి ఈ రోజునుంచీ సంగీతాన్ని విని ఆనందాన్ని అనుభవించండి.



# సంగీతం పై నూతన పరిశోధనల

సంగీతానికి ఎంతో శక్తి ఉంది. త్యాగరాజు
స్వరూపిణి' అనే రాగం పాడితే దీపం దానంతటు అదే వె
చెబుతారు. అలాగే త్యాగయ్య బిలహరి రాగం పాడి చని
వ్యక్తిని బ్రతికించాడని చెప్పుకొన్నాం. అలాగే తాన్‌సే
గాయకుడు 'దీపక్' రాగం పాడి దీపం దానంతటు అదే
చేశాడని చెబుతారు. ముత్తుస్వామిదీక్షితార్ అమృత వర్షి
పాడి, వర్షం కురిసేలా చేశాడని ముందు తెలుసుకొ
ముత్తుస్వామి దీక్షితార్ సోదరుడు చిన్నస్వామి
'నాగవరాళి' అనే రాగం పాడితే ఒక పామువచ్చి, రా
రాగం అయ్యాక వెళ్ళిపోయిందట. ఇవన్నీ కట్టుకథలుఅని
కొట్టి పారవేయనవసరం లేదు. ఎందుకంటే ప్రస్తుతం దేశ వి
సంగీతం పైన ఎన్నో పరిశోధనలు జరుగుతున్నాం
పరిశోధనల ఫలితంగా సంగీతానికి ఎంతో శక్తిఉందని
అవుతోంది. అలా సంగీతం పైన దేశవిదేశాల్లో జరు
కొన్ని కొత్త పరిశోధనలు గురించి తెలుసుకొందాం.

1969లో అమెరికాలో శ్రీమతి డోరోతి మొక్కలపైన
ప్రభావం ఎలా ఉంటుందో పరిశోధన చేశారు. ఆవిడ
పెట్టెల్లో మొక్కల్ని పెట్టారు. కొన్ని మొక్కలకి పాశ్చాత్య
వినిపించారు. కొన్నింటికి మన హిందుస్థానీ సంగీతం వినిపి
ఇలా రోజూ చేసేవారు. కొన్ని రోజులకి, హిందుస్థానీ

ఆ సంగీతం వినడానికి బాగా ఇష్టత చూపుతున్నాయన్న మాట
పాశ్చాత్య సంగీతం వినిపించినన మొక్కలు లౌడు స్పీకరు
మరోవైపు వంగాయి. అంతే అవి ఆ సంగీతాన్ని ఇష్టపడడ
లేదన్నమాట. ఈ ప్రయోగం వల్ల మొక్కలకి సంగీతం అం
ఇష్టమని, అందులోనూ రణగొణ ధ్వనులు లేని మనసంగీత
అంటే ఇంకా ఇష్టం అని తేలింది.

రష్యాలో కొందరు శాస్త్రజ్ఞులు పంటపొలాలికి సంగీత
వినిపిస్తే దిగుబడిబాగా పెరుగుతుందని కనుగొన్నారు. అలా
పాడి పశువులకి సంగీతం వినిపిస్తే పాల ఉత్పత్తి బాగా పెరుగుతుం
షాకల్టన్ అనే శాస్త్రవేత్త అంటార్కిటికా పరిశోధనలకోసం వెళ్ళాడు
ఆయన ఓమంచుదిబ్బమీద గ్రామఫోన్ పెట్టి సంగీతం వింటుం
ఆ గ్రామఫోన్ చుట్టూ పెంగ్విన్ పక్షులు చేరి సంగీతం వింటూండే
ఈ విషయాన్ని కెప్టెన్ స్కాట్ కూడా సమర్థించాడు. పెంగ్విన్
ఎవరైనా పాడినా కూడా విని ఆనందిస్తాయని చెప్పాడు.
ఫ్రెంచి పశువైద్యుడు గుర్రాలకు, గాడిదలకు సంగీతం వినిపి
అవి ఎంత శ్రమనైనా ఓర్చుకొని పనిచేస్తాయని చెప్పాడు.

లండన్‌లో ఓ మానసిక శాస్త్రవేత్త సంగీతానికి జంతువు
ఎలా ప్రభావతం అవుతాయో తెలుసుకోవాలను కొన్నాడు. ఓ
జూకి వెళ్ళి జంతువులకి సంగీతం వినిపించాడు. సంగీతం వి
అవన్నీ ఎంతో ఆనందించాయని, వాటి ఆనందాన్ని రకరకాలు
తెలియపరిచాయని ఆయన ఓవ్యాసంలో రాశాడు.

సింహాలు, పెద్దపులులు తమకి ఇష్టమైన సంగీతం విన్నప్పు

ఖడ్గమృగాలు, చిరుతపులులు కూడా సంగీతాన్ని ఎంతగ
ఇష్టపడతాయి. చక్కని సంగీతం వినిపిస్తే సాలెపురుగ
తాముదాక్కొన్న చోటునుంచి బయటకు వస్తాయి. కుక్క
పిల్లులు కూడా సంగీతం అంటే ఎంతో ఇష్టంగా వింటాయి. ప్రఖ
ఫ్రెంచికవి థియోఫిలెగాటియర్ తన పెంపుడు పిల్లి గురించి
రాశాడు ''దీనికి సంగీతం అంటే ఇష్టమేకాదు సంగీతంలో వ
పరిజ్ఞానం కూడా ఉంది. మా ఇంటికి ఎవరైనా వచ్చి పాడుతు
బాగున్నంతసేపు వింటుంది. నచ్చకపోతే పాడేవారి నోటిని,
పంజాతో మూసేయడానికి కూడా వెనుకాడదు.'' అని.

చిన్నపిల్లలు సంగీతం అంటే బాగా ఇష్టపడత
తెలుసుకొన్నాం. అయితే చిన్న పిల్లలేకాదు. తల్లిగర్భంలో ఉ
శిశువులు కూడా సంగీతం అంటే బాగా ఇష్టపడతారు. ఈ విషయ
బ్రిటన్‌కు చెందిన సైకాలజీ ప్రొఫెసరు 'క్లిఫర్డు వోల్ట్స్' కనుగొన్నా
ఆయన ఎందరో గర్భవతులైన స్త్రీలపైన పరిశోధనలు చేశ
ఆయన గర్భంతో ఉన్న స్త్రీ పొట్టపైన సంగీతం వచ్చే
ఫోన్స్ ఉంచేవారు. లోపల పిండం సంగీతానికి చాలా వేగ
కదలడం. పిండం గుండె కొట్టుకోవడంలో మార్పులు రా
ఆయన గమనించాడు. అయితే అన్నిపిండాలలోను ఈ చ
ఒకేలా ఉండేదికాదు. కొన్నింటిలో ఒక మాదిరిగాను, కొన్నిం
అస్సలు లేకుండాను, కొన్నింటిలో ఎక్కువగాను ఉండేది. ఆర
దాటాక పిండం శబ్దాలను వినగల్గుతుంది. పిండం ఎనిమిద
నుంచి బయట శబ్దాల్ని బాగా వినగల్గుతుంది.

నిరూపిస్తున్నారు. 1890లో శ్రీ విలియమ జమ్స్ ముదటిసా
సంగీతాన్ని వైద్యానికి ఉపయోగించారు. దీనిపై ఎన్నో పరిశోధనల
చేసి బ్రిటన్ సొసైటీ 'మ్యూజిక్ థెరపీని' ప్రవేశపెట్టింది. మ్యూజి
థెరపీ అంటే సంగీతంతో రోగాల్ని నయం చేసే చికిత్స అన్నమాట
బ్రిటన్‌లో మానసిక వ్యాధుల్ని నయం చేయడానికి సంగీతమే
మంచి మందు అని కనుగొన్నారు. మానసిక వ్యాధులను
సంగీతంతో నివారించారు కూడా. అమెరికాలో డా.శ్యా
భట్నాగల్ సంగీతంతో మానసిక వ్యాధుల్ని తగ్గిస్తున్నారు
అమెరికాలోనే చాలామంది వ్యాపారస్తులు, వ్యాపారంల
ఎదుర్కొనే సమస్యల వల్ల తమకు ప్రశాంతత లేకుండాపోతోందని
దీనికి ఏదైనా పరిష్కారం చూపించండి అని మానసిక వైద్యుల
అడుగుతున్నారు. వీరందరికీ ఫ్లాయిడ్ యస్. బోర్స్టెన్ అ
శాస్త్రవేత్త సంగీతంతో మానసిక ప్రశాంతతని చేకూర్చుతున్నాడు.

అమెరికా యువతి కుమారి కెల్మెన్ మనదేశం వచ్చి, మ
కర్ణాటక సంగీతంతో రోగాల్ని నయం చేసే విషయంపైన పరిశోధన
చేసింది. 'వీణ వాయించ గలననే భావనే నాలోని అన్ని రుగ్మతల
నాశనం చేసింది' అంటుందామె. శ్రీ మంగళం పల్లి బాలము
కృష్ణ కూడా మ్యూజిక్ థెరపీపైన పరిశోధనలు చేస్తున్నా
ఢిల్లీలో ఇటీవల రక్తపోటు, మాదకపదార్థాలకు అలవాటు పడ
లాంటి రోగాలను సంగీతంతో నయం చేయడానికి పరిశోధన
చేశారు.

ఇలా సంగీతం మీద ఎన్నో పరిశోధనలు జరుగుతున్నా

మందు అవుతుందేమో ?

## అవరోహణ

సంగీతంగురించి ఎన్నెన్నో విషయాలు తెలుసుకొనా
సంగీతం నేర్చుకోవలసి అవసరాన్ని, వినవలసిన అవసరాన్ని
మీరు గుర్తించే ఉంటారు. కర్ణాటక సంగీతంపైన ఆసక్తిని, అభి
పెంచుకొని తద్వారా మన కర్ణాటక సంగీతాన్ని కల
నిలుపుకోవలసిన బాధ్యత మనందరి పైనా ఉంది. ఈష
చదివిన పాఠకుల్లో కొద్దిమందైనా సంగీతం మీద ఆ
పెంపొందించుకొని, సంగీత ప్రియులుగా మారితే మా ప్రయ
సఫలీకృతం అయినట్లే.

### మంగళం

సౌరాష్ట్ర రాగం - ఆదితాళం - రచన: త్యాగరాజు

| | | |
|---|---|---|
| పల్లవి | నీ నామ రూపములకు - నిత్యజయ మంగళం | ॥ నీ ॥ |
| అనుపల్లవి | పవమాన సుతుడు బట్టు- పాదరవిందములకు | ॥ నీ ॥ |
| చరణం | రాజీవ నయన త్యాగరాజ వినుతమైన | ॥ నీ ॥ |



